# త్యాగం.

## సాంఘిక నాటకము.

కర్త:

గుడిపాటి వెంకటచలం.

ప్రకాశకులు:

దయానంద గ్రంథాలయము,

ఏలూరు, (కృష్ణాజిల్లా).

# మున్నుడి

ఆంధ్రంలో రోజుకురోజు వెలువడుతూన్న పుస్తకాలకు మితి లేదు. తెలుగుపుస్తకా లిదివరకు కాలంగడపడాని కుపయోగించే దృష్టితోనే ఎక్కువగా ప్రకటింపబడినై. కాని కొంతకాలాన్నుంచి ఆ భావన మారి మానవుని ముందుకు ప్రవర్తించే పుస్తకాలే ప్రకటితము లవుతూవున్నమాట సత్యం. అయితే అవి చాలవు. ముఖ్యంగా తెలుగులో ఎన్నో వుత్తమగ్రంథాల అవసరం వుంది. అందు కొన్ని ప్రచురణాలయాలు బయల్దేరినా ఇంకా కొరవగానే వుంటుంది ఆధునికాంధ్రసాహిత్యం.

యథాశక్తి పై కొరతదీర్చు తలంపుతోనే పుస్తకప్రచురణకు పూనుకున్నాం. సాంఘిక — రాజకీయ — ఆర్థిక — చారిత్రిక గ్రంథాలను ప్రచురిద్దా మని ప్రయత్నం. ఆ ప్రయత్న ప్రథమ ఫలితమే ఈ 'త్యాగం'.

ముందుగానే, త్యాగంను ప్రకటించే అవకాశం కలిగించినందుకు శ్రీ వెంకటచలంగారికి కృతజ్ఞులము. మానవజీవితంలోని యథార్థ స్వరూపాన్ని — మనోతత్వంలోని నిశితభావాలను — సంఘంలోని కుళ్ళును — నిర్భీతిగా, నిర్మొగమోటముతో, తేలిక భాషలో సరళమగు భావాలతో ప్రదర్శించడంలో చలంగారు సాటిలేనివారు. చలంగారి రచనల్లోని ఆదర్శాన్ని — గొప్పతనాన్ని — సత్యాన్ని ఇప్పుడిప్పుడే గ్రహించగల్గుతున్నా రన్న విషయం ఆసిద్ధహస్తునిరచనలందు పాఠకుల కున్న అభిరుచియే వెల్లడిస్తోంది. పాఠకులు మా యీ ప్రచురణను ఆదరించుతారనే నమ్ముతున్నాము. మీతోడ్పాటుతో అనుభవజ్ఞుల అనేక పుస్తకాలను ప్రకటించగలము.

— శ్రీదయానందగ్రంథాలయసంఘము.

# పాత్రలు:

| | |
|---|---|
| సీతాకాంతం | ... |
| భ్రమరాంబ | తల్లి |
| కేశవరావు | భర్త |
| శ్రీనివాసులు | ... |
| వనకుమారి | బోగంది |

# 'త్యాగం'

## ఒకటో రంగం

[రాత్రి పదకొండుగంటలకు. కేశవరావుయిల్లు—పడకగది. వెనక వేపున కుడిచేతివేపు పందిరి పట్టిమంచము. దానిమీద పరుపు, దిళ్ళు. దాని పక్కన వెనకనడవాలోకి తలుపు; వొంటింటోకి వెళ్ళే భ్రమరాంబ దాంట్లోంచే తిరుగుతో వుంటుంది. కుడిచేతివేపున తలుపు; అది సందులోకి తెరుచుకుంటుంది—ఆసందు వీధిలోకి తెరుచుకుంటుంది. వీధిలోంచి వచ్చే కేశవరావు మొదలైనవాళ్ళు దాంట్లోంచి వచ్చి వెళ్ళుతో వుంటారు. ఆ తలుపు పక్కగా బల్ల; దానిమీద పెద్దఅద్దం, దానిమీద దువ్వెనలు, నాలుగైదు బుడ్లూ, తక్కిన 'టాయిలెట్' సామానులు; బల్లమీద 'టేబుల్ లైటు'. గోడకు 'టైంపీస్' (ఆగిపోయింది); రొమ్ము కనపడుతున్న యింగ్లీషుస్త్రీ వున్న బొమ్మగల కాలెండరు; ఊర్వశి, దమయంతి, సావిత్రి, రవివర్మ పటాలు; పక్కదగ్గిరిగా బట్టలులేని యూరోపియన్ స్త్రీల పటం. వెనక తలుపుదగ్గిర నిద్రతో మూతబడే కళ్ళతో భగవద్గీత చదువుతో భ్రమరాంబ కూర్చుని వుంది. ఆమె తలగొరిగిన వితంతువు. నలభైఏళ్ళు. దృఢంగా వుంది. బల్లమీద అద్దంలో చూచుకుంటో, జుట్టు సవరించుకుంటో, పమిట సద్దుకుంటో సీతాకాంతం నుంచుని వుంది; అప్పుడప్పుడు ఆబల్లమీదే సగంకూచుని మాట్లాడుతో వుంది. సీతాకాంతం చాలా తెల్లనిది. సన్నగా వుంది. ముఖం నిర్మలం, అమాయకము. ఇంకా బొమ్మలతో ఆడుకుంటోందా అనిపిస్తుంది. కాని వెకిలితనము లేని గాంభీర్యము వుంది. లోకంలో అడుగుపెట్టిందా యీపిల్ల అని ఆశ్చర్యమేస్తుంది. తను అందమైన దాన్నన్న జ్ఞానం కలదిలాగు అద్దంలో చూసుకుంటుంది. నవుస్తుంది. కాని మాట్లాడేప్పుడా సంగతి మరిచిపోతుంది.]

భర్త: (శ్లోకం చదువుతో మధ్యలో) అదుగో పదకొండు!

సీ: కాదు, పది.

భర్త: ఇందాకా నువ్వు కిటికీలోంచి తొంగిచూస్తున్నప్పుడు పది.

సీ: ఇంకా రాలేదే!

భర్త: వొస్తాడు! వొస్తాడు! యింకా కాచుకూర్చో. నిద్ర పొమ్మంటే వినదు, పెంకిపిల్ల. నేను వెళ్ళి పడుకుంటా నమ్మా! నిన్నరాత్రి రైల్లో నిద్రలేదు.

సీ: వొద్దు. నాకు భయమేస్తుంది. వొస్తారు, అమ్మా!

భర్త: (హేళనగా) వొస్తారు తెల్లారి!

సీ: నిద్రరాదు. ఎట్లా వొస్తుంది? (వింటూ) అదుగో! (కిటికీ దగ్గిరికి వెళ్ళి) అదుగో వచ్చారు. యింక వెళ్ళు అమ్మా! (ఆతుర్తతో చూస్తూ) కాదు. ఎవరో! ఆయన కాకూడదూ? యిందరు యిట్లా నడుస్తారే!

అమూల అడుగులచప్పుడు కొంచంగా మొదలుపెడుతుంది. మెల్లిగా ఎక్కువవుతో వొస్తుంది చెవికిందికి. ఆయనే అనుకుంటూ. కదిలితే తల యెత్తిచూస్తే యెక్కువ కాకపోతుందేమోనని అట్లానే గట్టిగా బిగపట్టి పడుకుంటా. గుమ్మంలో ఆగినట్టే వుంటుంది. కాని క్రూరంగా మెల్లిగా తగ్గుతో వెళ్ళిపోతాయి పాదాలు. చీకట్లో అందరు ఎక్కడికి వెడతారో! ఒక్కటి

అయ్యున కాకూడదూ. ఒక్కపాదాలు యీ యింటిని గుర్తుపట్టి ఆగకూడదూ. ఒకప్పుడే చీకట్లో యిల్లు గురుతు తెలియక వెదుకుతో వున్నారేమో అని లేచి సిలవా లనుకుంటూ. 'యిదే యిల్లు' 'నేనే' అనా లనుకుంటూ.

భర్త: అన్నావు గావు నయం!

సీ: ఇంక రారని నిద్రపట్టించుకుంటూ వుంటే మళ్ళీ యింకో అడుగుల చప్పుడు.

భర్త: అబ్బా! చాలు: దీపం తగ్గించి పడుకుందూ.

సీ: క్లబ్బులో ఆలస్యమైందేమో!

భర్త: ఈయనకోసం అర్ధరాత్రి క్లబ్బులని ప్రత్యేకం పెట్టించారు!

సీ: ఏమో? తప్పకుండా త్వరగా వొస్తానన్నారు. ఏదన్నా మోటారుకింద పడ్డారేమో.

భర్త: పడి ఏకాలో విరిగితేనన్నా బావుండును! ఇంటిపట్ల పడి వుంటాడు.

సీ: ఏం లాభం? మనసంతా అక్కడవున్న తరవాత! మోటారు మీద వెడతారు అప్పుడు.

భర్త: కుంటివా డెవరికి కావాలి?

సీ: డబ్బుంటే చాలటగా వాళ్ళకి. (సీత అద్దంలో చూసుకుంటోంది) నేను బాగాలేనే అమ్మా?

భర్త: కళ్ళున్న వాళ్ళకి—

సీ: (ఆలోచనగా) నా వంక చూసుకుంటేనే అమ్మా నామీద నాకు ప్రేమ వస్తుంది. ఎంతచక్కని మొహం అనుకుంటా. అద్దంలో యింకెవరో అనుకుని చూస్తా. ఎందుకంటే నేను బావుంటానమ్మా.

భ్రి: పెళ్ళికాగానే పనికిరాదు అందం.

సీ: ఎందుకో.

భ్రి: చేటురోగం.

సీ: చెప్పవేం, అమ్మా! నీకు తెలీదూ?

భ్రి: ఆకాశం అందం ఎంతవుంది చూస్తారు, నీలంగా జాపెంకు లేరుకుంటారుగాని!

సీ: ఇట్లా నీతో కూచుని మాట్లాడి ఎన్నో రోజులయింది. (సీత మొహానికి పౌడరు వేసుకుంటోంది. సోమరిగా ఆటగా ఏం లోచనట్లు)

ఈయనేనా, మొగవాళ్ళందరూ యింతేనా?

భ్రి: అందరూ అంతే! పశువులు.

సీ: నాన్నా—?

భ్రి: ఇంతే.

సీ: ఏం చేశావు?

భ్రి: దిగమింగుకుని వూరుకున్నాను. ఏంలాభం! మురుగు గొయ్యి కళ్ళుతీసుకుని! బయిటికివెళ్ళేవాళ్ళని ఎట్లా అదుపులో పెట్టడం?

సీ: ఎట్లా వూరుకున్నావో! పగలు రాత్రి రంపంతో కోస్తున్నట్లుంటుంది, తలుచుకున్నకొద్దీ (మెళ్ళో గొలుసు సర్దుకుంటూ) యీ తెలుపుమీద బంగారం ఎట్లా మెరుస్తోందో చూడు. (ఆగి) పడుకునేప్పుడు అంతామరిచి నిద్రపోతాను. తెల్లారి లేచేప్పటికి నెత్తిమీద ఎవరో దెబ్బకొట్టినట్లు అంతా జ్ఞాపకంవొస్తుంది. భక్తితో పూజచేస్తున్న తులసిమొక్క ఒకరోజు పొద్దున్న చూసేప్పటికి గంజాయిమొక్కగా మారినట్లుంటుంది. ఒక్కొక్క రోజు ఆయనకి నన్ను చూడడమే కష్టంగావుంటుంది. నేను చచ్చిపోతే, ఆయనకి సంతోషం కలిగేట్లు అనిపిస్తుంది.

భ్రి: ఛా, వూరుకో. వూరికే అధైర్యపడకు. ఎన్నాళ్ళా తిరగడం. ఏమో తాత్కాలికంగా మతిచెలిస్తుంది. మళ్ళా యింటికి చేరుకుంటారు. ఈ మొగవాళ్ళే పిల్లలమోస్తరు అజ్ఞానులు. వొద్దంటే వినరు. అల్లరిచేసి ఎక్కడో పదిదెబ్బలు తిని మన్ని వెతుక్కుంటూ వొస్తారు. మర్నాడు మళ్ళీ అంతే. మరి స్నానం చేయించి మందు రాయకండా ఆడది మూతి ముడుచుకుంటే వాళ్ళకి దిక్కెవరు?

సీ: మరి ఆడవారి హృదయబాధ తీర్చుకునేందుకు దిక్కెవరు?

భ్రి: ఈశ్వరుడు.

సీ: ఆ భోగంవాళ్ళు నాకన్నా బావుంటారా? వాళ్ళ కింత కన్నా మంచిచీర లుంటాయిగావును! ఏం? మరి నాకొనిపెట్ట కూడదూ, ఇంకా మంచిచీరెలూ, నగలూ? (అద్దంలో చూచు కుంటూ) పోనీ ఎవరన్నా గొప్పవాళ్ళను ప్రేమించినా, తాకినా, అది వొకమోస్తరు! నీచులు, అస్సె మాయులేకదా! అంతా మురికి; అసహ్యమేకదా! ప్రతివారికి దక్కుతారుగదా! అట్లాంటివాళ్ళని తాకి ఆ చేతులతోనే నన్ను... ఎంత కోప మొస్తుందంటే, యింట్లోంచి పారిపోవాలనీ, ఆ చేతులు కాల్చి య్యాల న్నంతకోప మొస్తుంది. వాళ్ళతో చేరి నన్ను నవ్వుతారు. నన్ను, నాకాలిగోరు, నాఅరికాలు మన్ను తాకటానికి పనికిరాని వాళ్ళందరికీ లోకువ నేను!

భర్త: వాళ్ళసంగతి నీ కేం తెలును? అందరూ అంత దుర్మా ర్గులా?

సీ: నేను చదవలా, పుస్తకా లన్నిటిట్లోనూ అట్లానేవుంది. ......నానాథుడు...దైవమే లోకువై నన్ను నవ్వులపాలు చేస్తే...నేను బతకనమ్మా, నేను చచ్చిపోతాను.

భర్త: నీ దయ, శాంతం, శీలం, క్షమ యివి అవసరం. వాటితో ఆకర్షించాలి

సీ: ఇంకా నీమాటలు వింటే యింకా భ్రష్టురాల్ని అవుతాను. నీలోభవల్లనేగా నా సంసారం పాడయింది!

భర్త: ఏమిటి? మంచి పుస్తకాలు బోధించటంవల్లా?

సీ: ఆ! నిన్నందేహంగా వాళ్ళు మంచిపుస్తకాలు చూసేనా అక్క-
డికి వెళ్ళారు?

భర్త: వాళ్ళ ఆదరణను చూసి వెళ్ళారు. రాగానే నువ్వు కాళ్ల
కుక్కనలే మీద పడుతోవుంటివి.

సీ: లేకపోతే చచ్చినట్లు పడివుంటాను! అదుగో, అట్లాంటివి
బోధించే కొంపకుచేటుతీసుకొచ్చావు. పాతివ్రత్యం, పతిభక్తి,
భర్తకు ఎదురాడకపోవడం యిదే ధర్మాలు మంచిగుణాలు
కావాలిగాని, మంచిబట్ట లెందుకు? మనోశుభ్రము సంగతి
బోధించారుగాని, శరీరశృంగారము నేర్పారా? నా భక్తి, సేవా
ధర్మం ఎందుకు అక్కరకి వొచ్చాయి? ఎవరు చూశారు?
'ఇట్టా వున్నావేం, ఆ రవి కేమిటి?' అంటే, 'పోసిద్దురూ నే నేం
బోగందాన్నా' అన్నాను. ఆయనకి కాళ్ళుకడిగిన చేతులు పనికి
వొచ్చాయా? మొట్టి రూపాయిలు లాగేవి నెత్తినపెట్టుకున్నారు.
భక్తితో వొంచినముఖము, వెక్కిరించి నవ్వే టక్కు, ఆమాల
మొహం దేవత్తెంది. కాఫీ స్వయంగా కాస్తే 'ఛా, పొగకంపు'
అన్నారు. రాత్రి కాళ్ళు పిసుగుతో కూచుంటే అట్టానే
మాట్లాడకండా నిద్రపోయినారు. చీరెలు, గంధాలు, అత్తర్లు,
అన్నీ బోగంటక్కులు పనికిరావంటివి. వాటికోసమే నన్నడివి
పాల్చేశారు. ప్రేమకాని కామం కూడదంటివి. అది చూపక
పోతేనే 'నీకేం రక్తంలేదూ, ఆడదానివి కాదూ, నా కొక్కడికే

యీ వుత్సాహం, ఆనందం' అని ఎన్నోసార్లు విసుక్కున్నారు. అదుగో వొచ్చారు (చప్పున మానేసి లేచింది త్వరగా) వెళ్ళమ్మా, వెళ్ళు. (భ్రమరాంబ వెళ్ళింది. సీతారాం చప్పున మంచంమీద బోర్లపడుకుని నిద్రనటిస్తోంది. కేశవరావు చప్పుడు కాకండా వొచ్చి కండువా తగిలించి జోడువిప్పి సీతారత్నం మేలు కుందో లేదో తెలుసుకోడానికని మెల్లిగా మాట్లాడుతున్నాడు.)

కే: దీపం తగ్గించలేదేం? నిద్రే! ఆ బోర్లపడుకోడ మేమిటి? (నిద్రపోయిందని నిశ్చయించుకుని, బయిటికి వెళ్ళి, బయిటి తలుపు గడియవేసి, గదితలుపు గడియలువేసి, బల్లమీద గ్లాసులోని పాలుతాగి, చీల్చిపెట్టివున్న తమలపాకులు వేసుకుని, కిటికీలోంచి బైటికిచూసి, నిట్టూర్పువిడచి, మెల్లిగా గోడవైపున సీతారత్నం ప్రక్కన పడుకోబోతున్నాడు. ఇదంతా సీతారత్నం చేతినందులోంచి చూస్తూనేవుంది. కేశరావు పడుకుని కళ్లుమూసుకున్నాడు. సీతారత్నం అల్లానే పడుకుని 'సిగ్గులేదూ' అంది.)

కే: (కళ్ళు మూసుకునే) ఉ, ఏమిటి? (మాట్లాడకు) ఏమిటా వేషం, మేలుకుని వుండే! (సీతారత్నం తలక్రింది చేతిని లాగేశాడు)

సీ: పొండి, సిగ్గులేదూ. నన్ను ముట్టుకోకండి పొండి.

కే: ఏమిటా కోపం? ఎందుకు?

సీ: ఎందుకు: ఎప్పుడు వస్తానన్నారు?

కే: ఆలస్యమైంది. పాపం నాకు చాలావిచారంగా వుంది.

సీ: పాపం! ఎందుకైంది ఆలస్యం? అది చెప్పండి.

కే: ఎందుకడుగుతావు? నీతో అబద్ధం చెప్పడానికి యిష్టంలేదు.

సీ: అబద్ధాలే చెప్పండి. అప్పు డింత ఏడవనుగా!

కే: పిచ్చి పిల్లా! పడుకో.

సీ: ఏమిటి పడుకునేది? నే నెందుకు పడుకోవడం? ఎందుకు వొచ్చా రిక్కడికి, దాందగ్గిరే వుండక?

కే: నువ్వు ఏడుస్తా వని.

సీ: ఏడుస్తానని పాపం! యిప్పుడు సంతోషిస్తున్నాను. నాకోసం ......నాకోసంట. (మాటలేదు)
(గొంతుమార్చి) నన్ను చంపరాదూ — చంపరాదూ — చస్తే సంతోషమేగా! ఒక్కసారి గొంతు పిసికెయ్యరాదూ! యిం కెందుకు నేను బతికి? ఎందుకు? (ఏడుస్తోంది. కొంతసేపు కేశవరావు వూరికే చూచున్నాడు తరవాత అతని మొహం లోకి జాలివొచ్చింది. ఆమెవేపు చేతులుజాచి తాకుతున్నాడు)

కే: యిల్లారా.

సీ: ఛీ, ఛీ, నన్ను తాకకండి. అది వుండగా నే నెందుకు?... అదుగో! తాకారంటే వెళ్ళిపోతా. బయిటికి దూకుతా. దూరంగా వుండండి. నే నెందుకూ, నే నెవరిని?...వదలండి. నన్ను తాకారా...ఛీ...వదలండి...అదుగో! తల మంచా

న్నేసి బాధుకుంటూ...అవును, బాధుకుంటే మాత్రి మెవరికి? మీ కేం? పీడ విరగడై పోతుంది. రాత్రింతా దాంతోనే వుండ వొచ్చు హాయిగా.

కే: వుండు. ఏమిటా అరుపు. బుద్ధిలేదూ. (నెమ్మదిగా) ఎందుకు చస్తా నంటావు? నీవు చస్తే నే నేమాతాను?

సీ: అయ్యో! అయ్యో! ఎక్కణ్ణించి వొస్తున్నాయి ఆ మాటలు? (గొంతుమార్చి) నిజం చెప్పండి. నిజం ప్రిమాణంచేసి చెప్పండి నేను చస్తే మీకు దిగులు వుంటుందా?

కే: ఆ ప్రిమాణంచేసి చెపుతున్నాను. నా కమితమైన బాధ కలుగుతుంది. జీవితంమీద విరక్తి కలుగుతుంది.

సీ: అయితే నామీద యింకా ప్రేమ వుందా, కొంచెం ఏమూలన్నా—

కే: (కావిలించుకుంటో) నిజంగా వుంది. నువ్వు వృధాగా బాధ పడుతున్నావు పాపం!

సీ: (అతని బుజంమీద తలపెట్టుకుని) నిజమేనా, నేను చచ్చి పోతా నని అంటున్నారా?

కే: నిజం.

సీ: ఎట్లా నమ్మను? మరి ప్రేమవుంటే, దాన్ని—

కే: అది మరిచిపో—మరిచిపోవాలి—ఆసంగతి ఎందుకు?

సీ: ఎట్లా మరిచిపోను? రాత్రింబవళ్ళు యిక్కడ ఎర్రని యినుం పెట్టినట్లు కాలుస్తోందే. నాకూ మరిచిపోవాలనే వుంది; ఎట్లా?

కే: నిన్ను ప్రేమిస్తున్నాను; చాలదూ?

సీ: చాలదు. నన్ను ప్రేమిస్తే యింకో రెందుకు కావలసి వొస్తారు. అబద్ధం.

కే: కాదు, నాప్రేమ అంతా నీదే.

సీ: అబద్ధం, అబద్ధం, పొండి (తోసేస్తుంది.)

కే: దాన్ని—దాన్ని—ఛీ—అది నాచపలత్వం—అది నా పశుత్వం. నీ మాధుర్యం, నీ దయ ఎక్కడన్నా దిక్కుతుందా, నాభార్యవి—నారాణివి...

సీ: మంచిరాణీనే! యింకా పూర్వంమాటలు అని నన్ను వెక్కిరించకండి. ఎంత గాయం చేస్తాయనుకొన్నారు ఆమాటలు! మీకు వుద్యోగమైన మొదటిరోజున, ఆ వానలో రావి చెట్టుకింద, మెరుపులమధ్య, నన్ను చీకట్లో 'రాణీ' అని పిలిచారు...అబ్బా నన్ను బాధపెట్టకండి. వెళ్ళిపొండి. నన్ను నా చావు చావనివ్వండి (ఏడుస్తోంది).

కే: నీ పొడరంతా కరిగిపోతోంది. శుభ్రమైన గంధంమానేసి ఆ పొడ రేమిటి?

సీ: అవును, నా కెందుకు పౌడరు? మేము పౌడర్లకి తగుదుమా ?

కే: అదికాదు. నిన్ను చూస్తే నా కెంతో గౌరవం. ఆ నీచులు మళ్లీ నువ్వు వేషాలువేస్తే నాకు బావుండదు ఆపక్క పాపిడి-ఆ పౌడరు - ఆ జాకట్లు - అవేమిటో నీకు సరిపోయిన ట్టుండవు. నీ గొప్పతనము పోయినట్టుంటుంది. నీకు అందంలేకనా యివి !

సీ: అవును - చాలాఅందంవుంది నాకు ! చాలాలాభం వొచ్చింది, అందంవల్ల! యీషోకులకి మేము తగుదుమా! పూర్వోత్తరము గంధాలు రాసుకుని, కొప్పులుపెట్టుకుని, భార్య యింటో మూలుగుతో పడివుండాలి...మీ ప్రియాంగనలు మాత్రం, యివన్నీ వేసి కులికి మీకళ్ళని మిరుమిట్లుగొలిపి...

కే: నీకూ వాళ్ళకీ పాటా?

సీ: అవును, పాటా! ఎవ రెక్కువో తెలుస్తోనేవుంది! నేను పూర్వోత్తరంగా వుంటాననేగా నన్ను వొదిలేశారు.

కే: అందుకని యివ్వన్నీ సాగించావా? పిచ్చిదానా! నిన్ను చూస్తే జాలేస్తోంది...చూడు, నీవే పవిత్రురాలివి. నిజంగా సీతవి. సీత యీవేషాలు వేసుకుంటే యెట్లా వుంటుంది? నిన్ను కావిలించుకుంటే అప్పుడే మంచుతో తడిసిన మల్లెపువ్వుని కావిలించుకున్నట్టు...

సీ: చలివేస్తుంది... అందుకనే వాననచూసి, నలిపి, అవతల పారేశారు... నే నేం పువ్వునీకాను, దేవతనీకాను, సీతనూ కాను. న న్నేం పొగడక్కర్లేదు. అట్లా అనే నన్నువొదిలి మనుషుల దగ్గిరికి వెళ్ళారు. నేనూ మనిషినే. నాకూ కావాలి మోహం. నాకూ వుంది రక్తం. నేనూ పడతాను బాధ..మనిషినే... నే నెంత యమబాధ పడుతున్నానో ఎట్లా తెలుస్తుంది - ఎవరికి కావాలి (ఏడుస్తోంది).

కే: (బాధతో) అబ్బా, ఏడవకు. ఏడిస్తే అసహ్యంగా వుంటావు.

సీ: ఆఖరికి యేడవనుకూడా యేడవకూడదు. నాగతి యింత వరకు వొచ్చింది (ఏడుస్తోంది).

కే: (బాధతో) అబ్బా! వూరుకో. నేను దుర్మార్గుణ్ణి. నీవంటి సుకుమారిని, పతివ్రితను వొదిలి, పశువున్నై, అధముడ్నై పోయినాను. నిన్ను తాకడానికి అనర్హుణ్ణి నన్ను నాదోవను పోనియ్యరాదు. చచ్చా ననుకో...యీ బాధపడడం, యేడవడం మానేస్తూ. ఇంక పనికిమాలినవాడు బాగుపడ డని నా గతికి నన్ను వొదిలెయ్యి.

సీ: ఎట్లా వొదలనూ - ఇన్ని ప్రేమబంధనాలతో కట్టుకొని నాచేత ప్రేమింపించుకుని, చప్పున నన్ను వొదలెయ్యమంటే, హృదయం రక్తం కారుతో వుంటే ఎట్లా వూరుకోను.

కే: పోనీ, నన్ను ఏదో స్నేహితుడిగా చూడు. యీవెధవతో నా కేమనుకో——మరిచిపో——నన్ను అసలే మరిచిపో——

సే: ఎట్లా మరిచిపోను——ప్రతిరాత్రి నాతో కూర్చుని, నవ్వి, గంధాలు రాసుకుని, తాంబూలాలు వేసుకుని, నన్ను తొడమీాద కూచోపెట్టుకుని, కథలు చెప్పి...యిప్పుడు నే నేం కాను. ఎట్లా గడపను...అబ్బా మీా కర్థంకాదూ——యీ పెదిమల్ని—యీబుజాల్ని - చూడక - చూడకా - కాదు - కాదు - దాంతో - ఏ పాడుముండతోనో - నన్ను గట్టిగా - చక్కగా - ముద్దు - అబ్బా - పోండి - పోండి - పోండి. నన్ను చంపడానికి ఎందుకు వస్తారు? మరిచిపోవా లన్నా ఎట్లా మరవను? మాట్లాడ రేం - మాట్లా, మాట్లా - ప్రేమిస్తా, ప్రేమిస్తా - అట్లా చచ్చిపోయినవాడిమల్లె కళ్ళు, చెవులు, అన్నీ మూతలు పడి - అట్లా పోయినారే. ఎంతకోపించినా, ఎంత ప్రార్థించినా లాభంలేదు. రాయి - రాయి——ఆ హృదయం రాయి - ఎందుకండీ యిట్లా అయినారు? నే నేం చేశాను? (కాళ్ళమీాద పడింది) నే నే అపరాధం చేశాను? మీాకు ఎట్లా అసహ్యం కలిగించాను? మనసులోగాని, పనిలోగాని మిమ్మ ల్నేమన్నాను? మీాకు కోపం వస్తే - కోపమన్నా రాదేం నామీాద. పూర్తిగా మాయమునారు. మీారు నాకు లేరు, మీాకు నేను లేను. కొట్టండి, తిట్టండి, చీల్చండి, చంపండి కాని నాతో సంబంధం లేనట్టు, నామాటలు వినబడనట్టు, అట్లా కూచోకండి. అట్లా చూడకండి.

భరించలేను. (ఏడుస్తోంది) ఏంపాపం చేశానండి. నావల్ల యేం లోపం? ఎందుకు ప్రేమించారు? నన్నెందుకు మోసంచేశారు? అయ్యో యెట్లా భరించను...ప్రొదలరూ - దాన్ని వదలరూ, నాతో మునపటిమల్లే ఆడుకోరూ, యింతశిక్ష! దేనికి?

కే: కూచో. నామాట విను ముందు. నీకు నిజంగా బాధ వుంటుంది. అది నిజమే, కాని సమాధాన పెట్టుకోడం నేర్చుకోవాలి.

సీ: నేను మనసు సమాధానం పెట్టుకోవాలి, మీరుమాత్రం మీపనులు మానుకోకూడదు, ఏం - సిగ్గయ్యేటం లేదూ.

కే: యింక భరించలేను, అట్లా ఏడిస్తే వెళ్ళిపోతా.

సీ: వెళ్ళిపోతున్నారూ! (అతన్ని కావిలించుకుని ఏడుస్తోంది) నన్ను వొదిలేసి వెడతారా? మధ్యాహ్నంనుంచి ప్రతినిమిషం ఎదురుచూస్తో కాచుకుని కూచుంటే ఏ దామొఖం. ఆ చెయ్యి యిట్లా తెండి. మీరేం చెయ్యమన్నా చేస్తా. దాని వేషాలన్నీ నేర్పండి, నేను మోహం చూపలేదనేగా. చూపుతా నేర్చుకుంటా - యిట్లా కావిలించుకొని. రండి, యిట్లారండి - మరి-

కే: (బాధతో) అబ్బా, వూరుకో ఓర్చుకోలేను. నిజంగా నీమీద నా కిష్టంలేదు. పోనీ, అట్లా నాకు బావు డవు. నన్ను బాధపెట్టకు.

సీ: ఏం చేశానండి. ఏమి చెయ్యనండి!

కే: నాకు మనసు మారిపోయింది. నేనుమాత్ర మేమిచెయ్యను?

సె: మీరు మార్చుకుంటే మారింది.

కే: మన శక్తిలో వుందా? వాళ క్తికి మించింది.

సె: అంతవరకొచ్చిందీ. పొండి. వెళ్ళండి. నీచుడా, దుర్మార్గుడా, ముండలవాడా! పో పో.

కే: ఆ! ఏం - మరీ మితిమీరుతోంది వ్యవహారం? నాలిక కొవ్వొందా!

సె: కాను. మీరు చేసేపనులకి బుద్ధిచెప్పేవాళ్ళు లేకేగా. నే నంటే కోపమా. ఏమి టీపని అని చెప్పుతీసుకు కొట్టేవాడే వుంటేనా. నోరులేనిదాన్ని నేను గనక సరిపోయింది గాని (ఏడుస్తూ) యింక దిక్కు లేదుకదా, దీనికి నే నేంచేస్తే దీని కేంగతి అనికాని.

కే: తన్నులు కావాలా.

సె: తన్నండి పోస్సి, తన్నినా బాగానే వుందును. తన్నండి. అదే తక్కువైంది. అదే నయం. చాలు. దయచేయండి యింక.

కే: (లేచి కండువా, చెప్పులు వేసుకుంటున్నాడు.)

సె: అన్నదే చాలని వెడుతున్నారా, వెళ్ళండి. అస లెందు కొచ్చారు?

కే: ఏడవడానికి (వెళ్ళిపోయినాడు. సీత సబాయెు మూస్తోంది. వాకిక్క తలుపు తెరుచుకుని భ్రమరాంబ తొంగిచూసి లోపలికి వొచ్చింది)

భ్ర: వెళ్ళాడా?

సీ: (మాట్లాడదు)

భ్ర: వంపించావా?

సీ: (మాట్లాడదు)

భ్ర: వెర్రిపిల్ల!

(సీతాకాంతం చప్పున మంచానానుకుని ఏడుస్తోంది భ్రమరాంబ దగ్గిరిగా వెళ్ళి తలమీాద చెయ్యేసి మాట్లాడుతోంది) అట్లా పోట్లాడి ఏడిస్తే అతన్ని గాయం చెయ్యడం, నువ్వు గాయం కావడం తప్ప యింకేంలేదు.

సీ: మరి యీా బాధ?

భ్ర: మరి బాధ అని కురువుని మరింత రేపుతారా? విధ మది గాదు. ఎన్నిసార్లు చెప్పినా నీకు తెలియటంలేదు.

సీ: కానీ, అందరికీ లోకువైనాను. నువ్వూ ఆయన వేపే.

భ్ర: చేతకాని దానివి.

సీ: ఏం చేతకాదు.

భ్రి: ప్రేమించడం—

సీ: ప్రేమవల్లనేకదా యీ బాధ.

భ్రి: మరి అంతప్రేమించే దానివి, ఆయన ఆనందం భంగ పరుస్తావేం?

సీ: మరి నా బాధ.

భ్రి: మరి నీదే నిజమైన ప్రేమ ఐతే, యీ బాధతో నీహృదయం నృత్యం చెయ్యవద్దూ?

సీ: మరి ఆయనికి నామీద ప్రేమ లేదిదే.

భ్రి: ఇంతేనా నీప్రేమ! బిడ్డ తిరగబడితే తల్లి ప్రేమ పోతుందా?

సీ; బాధ పడదా?

భ్రి: కాని బిడ్డకి సహాయం చేస్తుందా లేదా? అట్లానే నీబాధని లక్ష్యం చెయ్యకు. అనుచుకో. అతనిసేవ చెయ్యి. పతివ్రత లందరూ అట్లానే కదా, ఆత్మసామ్రాజ్యన్ని ఏలుకోవలసింది?

సీ: పతివ్రతల కేం? వాళ్ళకి అన్నీ సాధ్యమవుతాయి. ఆ కాలమూ! ఆ మనుషులూ!

భ్రి: పతివ్రతలు వుంటే యిదే ఆ కాలంగానే మారుతుంది

సీ: సీతలు, చంద్రమతులు వుంటే ఏంలాభం! రాములు హరిశ్చంద్రులు ఏరీ?

భర్త: యీ సీతలూ, చంద్రమతులూ తమభర్తల్ని రాములూ హరిశ్చంద్రులూ చెయ్యాలి. మొగవాడు పశువైతే స్త్రీ తను కూడా పశువు కావచ్చా? తన శీలంచేత అతన్ని మృగత్వంనించి వుద్ధరించాలి.

సీ: అందాకా వైధవ్యం భరిస్తో, తాను ప్రేమించి పూజించే దైవము వేశ్యలకాళ్ళకడుగులో వుంటే సంతోషించ మంటావు.

భర్త: నీకు ప్రేమమహిమ తెలీదు. నిజంగా ప్రేమిస్తే ఆ ప్రేమే నీకు యీ శరీరసౌఖ్యాలకన్నా వున్నతమైన ఆనందాన్ని యిస్తుంది. అది ఎటువంటి ప్రేమ – భర్త ఎటువంటివాడైనా, ఏమిచేసినా, ఎంతహింసించినా చలించని......

సీ: అట్లాంటివాణ్ణి ప్రేమించే దెట్లా ముందు?

భర్త: భర్తగనక – భర్త అని...అంతే. అతనిరూపాన్ని కాదు, గుణాన్ని కాదు.

సీ: కొట్టినా, తిట్టినా...

భర్త: ఆ...యీభర్త, భౌతికభర్త యేమైతే నేం! నీహృదయంలోని భర్తని ఎవరు ఎత్తుకు పోతారు? విను, మళ్ళీ చెప్తున్నా. నీ సౌఖ్యం కోరి, వీటికోసం తగువులాడినన్నాళ్ళు శాంతిలేదు.

సీ: అన్నీ వుత్తదే. శాంతి ఎట్లా వొస్తుంది, అట్లాంటి భర్తతో.

భర్త ఎంత కావిలించుకుంటే మాత్రం వొస్తుందా ?

సీ: ఆ, తప్పకుండా వొస్తుంది.

భా: అదో శాంతా......ఎన్నాళ్ళు. ప్రయత్నించి చూడు. 'ఆ భర్త నాకేం ఆనందమిస్తా'డని వెతికి అత నివ్వనప్పుడు ఏడవడం కాదు. నేను అతని కేమివ్వగల నని ఆలోచించాలి. అత న్నెట్టా సంతోషపెట్టను అనే చింత ముఖ్యం. మనము ఆనంద మనుభవించడము కన్న యింకొకరికి ఆనందమిచ్చే ఆనందం అందుకోడం నేర్చుకోవాలి.

సీ: ఎట్లా ?

భా: త్యాగం వల్ల.

సీ: అంటే—

భా: నువ్వతన్ని ప్రేమిస్తున్నావు గదా!

సీ: ఆ—

భా: మరి అతనికి ఆనందం యివ్వవా ?

సీ: ఇస్తాను.

భా: నీకు బాధ కలిగినా ఏం ?

సీ: అమ్మో!

భర్త్రి: అయితే అ దేమి ప్రేమ!

సీ: సరే సనుకో.

భర్త్రి: మరి అతని కామనిషే కావాలి.

సీ: ఛా.

భర్త్రి: అదుగో, చూశావా, ఆ అహంభావమే కూడదు. యింక త్యాగ మేమిటి?

సీ: అ దేంప్రేమ? కొరివిపెట్టి తలగోక్కున్నట్టుంది.

భర్త్రి: నీ కర్థంకాదు. మాధుర్యం అనుభవిస్తేనేకాని బోధపడదు.

సీ: నాకు వొద్దు ఆ త్యాగం.

భర్త్రి: త్యాగమే సృష్టిరహస్యం. ప్రేమ అంటేనే త్యాగం. ప్రతినిమిషం ఈశ్వరుడు తనస్వేచ్ఛని త్యాగంచేసి, ఆనందాన్ని పొందుతున్నాడు. ముఖ్యము, త్యాగమూర్తి అయిన స్త్రీ ద్వారా సృష్టించుకుంటున్నాడు తన ప్రపంచాన్ని. పతివ్రత లందరూ యీశ్వరాంశసంభూతులు. చంద్రమతి చేసిన త్యాగం ఆమె కెంత మహానందాన్ని యిచ్చివుండాలి! నాటకాల్లో ఆమె యేడ్చిందని వ్రాస్తారు కాని...

సీ: నిజమేనా?

భర్త్రి: ఏ పతివ్రత త్యాగం చెయ్యలేదో ఆలోచించుకో.

సీ : మరి ఆ త్యాగంవల్ల ఆయనకి నాపైన మనసు తిరుగుతుందా ?

భగ : అదుగో - ఆ నా - అనేమాట వొదిలెయ్యి. ఆయనకు సంతోషం కలుగుతుందా అని ప్రశ్నించుకో. ఆయన ఆనందమే నీది.

సీ : నాకు బాధకలిగించినా—

భగ : ఆయన ఆనందంగా వుంటే నీకు బాధ ఎక్కడిది ? ఆయనే నువ్వు, నువ్వే ఆయన.

సీ : ఏంచెయ్యి నిప్పుడు ?

భగ : పోట్లాడకు. సంతోషమ్మునముఖం కనపరుచు. సేవచెయ్యి. ఏమాత్రము బాధ ఆయనికి కలిగినా, అది మాన్పడానికి నీప్రాణం - నీసుఖం - నీమానం- అన్నీ త్యాగంచెయ్యి.

సీ : ప్రాణమా—చచ్చిపోతే యింక యీత్యాగంవల్ల లాభం ఏమిటి?

భగ : అదుగో లాభ సంగతి మాట్లాడుతున్నావు.

సీ : మరి యిట్లా మొగ్గపడడానికి, ఆయనతో కారణం చెప్పనా?

భగ : ఎందుకు చెప్పడం?

సీ : మరి నేను త్యాగంచేస్తున్నానని తెలియడ మెట్లా ?

భగ : తెలియడ మెందుకు?

సీ: తెలియకపోతే ఆయన మనసు తిరగడ మ్మోల్లా?

భ్రి: అదుగో మళ్ళీ ఆసంగతే, నీ సంగతే ఆహా!

సీ: మరి ఆయన చివరికి నన్ను పేర్మిస్తా రన్నావుగా?

భ్రి: అయ్యో! వెర్రితల్లీ. మాటలతో చెప్పాలంటే మన గొప్ప తనము! మనము చెప్పుకోవాలా! మనకార్యాలవల్ల వ్యక్తం కావాలి.

సీ: ఏమో! సరేలే.

భ్రి: ఇంక పడుకో.

సీ: నువ్వుకూడా యిక్కడే పడుకో. అమ్మా! నాకు భయ మేస్తుంది. ఈపాటికి దాంతో కలిసి నవ్వుతో వుంటారు. 'అంతే కావాలిదానికి' అంటో వుంటారు. ఎవడన్నా చితక బాదితే— అమ్మా పతివ్రితలు ఏమాటంటే అది జరుగుతుందికదూ? (పడుకుని) అమ్మా!

భ్రి: ఏం?

సీ: కాని యీబాధ ఎన్నాళ్ళని భరించను?

భ్రి: పిచ్చిదానా! సరియైనజ్ఞానంతో చూడు. యిదంతా మాయకదా! నువ్వు- యీలోకం- నీబాధ- నువ్వు బాధపడు తున్నా ననుకోడం - అంతా మాయకదా!

సీ: యీబాధ నిజంకాదా?

భ్రి: అంతా కల.

సీ: ప్రేమ-?

భ్రి: ప్రేమకాదు. ధర్మము ఒక్కటే శాశ్వతము.

— తెర —

## 'త్యాగం'

### రెండో రంగం

[రాత్రి తొమ్మిదిగంటలు వనకుమారి యింటో పడకగది. ఎడమ చేతివేపు నించి ఒకటే తలుపు వెనక పందిరిపట్టెమంచం. దాని ముందు కొంచం దూరంగా తివాసి మీద హార్మోనియం ముందుపెట్టుకుని వనకుమారి కూచుని వుంది. ఆమెకి ముప్ఫైయేళ్ళకి లోపు. ఆమె అందమంతా ఆమె జుట్టులోనూ, ముక్కులోనూ వుంది పక్కనించి చూస్తే కాశ్మీరపు స్త్రీ లాగు కనపడుతుంది ]

(మంచంమీద కేశవరావు కూచునివున్నాడు.)

వ: ఛా, ఏ విటా బూతుమాటలు!

కే: నీకు బూతుమాటలనేవికూడా వున్నాయా?

వ: మీవంటివారిసహవాసం వల్లనైనా, మేము ధన్యులం కావాలని చూస్తాం, పువ్వులవల్ల నారకి వాసన వొచ్చినట్లు; విష్ణుభక్తివల్ల రాక్షసులు ముక్తి పొందినట్లు. కాని మీరే మా గతికి దిగుతారా!

కే: మీ అంటివాళ్ళంటే—నే నేం గొప్పవాణ్ణనా!

వ: కాదు మరి; కులం గొప్ప: వంశం గొప్ప: ధనం గొప్ప.

కే: అంతే—

వ: (చిరునవ్వుతో) సరే: అందంగొప్ప: బలం గొప్ప.

కే: అంతేనా?

వ: (సిగ్గుతో) మీకే తెలును. అనాలా యేమిటి?
(చిరునవ్వుతో వోరగా చూస్తోంది)
కే: అబ్బా! అట్లా చూస్తే నేను వోర్చుకోలే నన లేదూ! ఎం దుకు చూస్తావు?
వ: ఆడదాన్ని గనక, మీదయ ఆశించిందాన్ని గనక.
కే: ఆడవాళ్ళందరూ చూస్తారా నావంక!
వ: రసికత్వమూ, బుద్ధీ వున్నవాళ్ళందరూ.
కే: నిజంగా నే నంత బావుంటానా? (అద్దంలో చూసుకుంటు న్నాడు) నన్ను పొగడడానికి అంటున్నావు.
వ: మీకళ్ళకే కనపడుతో వుండగా, న న్నడగడ మెందుకు?
కే: నీకళ్ళల్లో చూడాలని వుంటుంది.
వ: మీభార్య కళ్ళల్లోనో?
కే: ఏమీ కనపడదు.
వ: ఐతే యింక భార్య ఎందుకు?
కే: సంసారానికీ, పిల్లలకీ—
వ: చాకిరీకి భార్య; ఆనందానికి వేశ్య.
కే: ఔను.
వ: కాని, నాకు నేను భార్యని కావాలనే వుంది.
కే: ఏం?

వ: (కొంచెం ఆవేశంతో) స్థిరంగా, దృఢంగా, గాఢంగా నాదేనని—యెప్పటికీ, అంతా, సంపూర్ణంగా ఐక్యమై భేదం లేకండా నేనే నని—ప్రేమించాలని అమితమైన కాంక్ష నన్ను కాలుస్తుంది.

కే: ప్రేమించరాదూ?

వ: ఎవర్ని?

కే: నన్ను.

వ: (నవ్వుతోంది దిగులుగా) ఎన్ని జన్మాలెత్తితే మీరు నా వారౌతారు? నాకే భర్తవుంటేనా—మీ భార్య యెట్లా ఓర్చుకుందోగాని— నా జీవితమంతా, నా శక్తినంతా, నా తెలివినంతా, నా హృదయాన్నంతా— అంతా అర్పణంచేసి, పెనవేసుకుని, కళ్ళుకప్పేసి, నాలో లీనంచేసుకుంటాను.

ఆ యీశ్వరదయ వుంటే వేశ్యకే నా అద్భుతమైన ప్రేమరాజ్యం తటస్థపడుతుంది. అంతా మన పూర్వజన్మసుకృతం.

జన్మవల్లగాక గుణంవల్ల సంసారి, వేశ్య అనే విభాగము చెప్పాడును.

మీ రెందుకు యిక్కడికి వొస్తున్నారో మీకూ తెలుసు; నాకూ తెలుసు; వీధులో వాళ్ళకీ తెలుసు.

ఈ భార్యల్ని చూస్తే దిగులేస్తుంది. తమ భర్తల్ని ఆకర్షించుకో లేనివాళ్ళు మమ్మల్ని తక్కువగా చూస్తారు. మమ్మల్ని తాకిం

తరవాత తమని తాకనియ్యకండా నిషేధించే ధైర్యం లేనివాళ్ళు మాకన్నా అధికు లెట్లా ఔతారు? పిచ్చి!

కే: కాని నువ్వే సంసారివైతే, నాకు కనపడి వుండేదానివా? ఒకవేళ నాభార్యవైతే తప్ప... కాని అప్పుడు... నీసొగసు, నీవినును, నీమసను......ఏదీ పాడు.

వ: అ దేమిటో నాకు రాదు.

కే: అదే- 'లావణ్యరామ'——

వ: నాకు రాదు——

కే: అన్నట్టు ఈకృతులు దానికి వొచ్చు— మా ఆవిడకి. నాకు మతే పోతోంది, నిన్ను చూస్తున్నకొద్దీ.., పాడు — యింకో టేదన్నా పాడు...'ఏమీ మాయమూ చేసీ, పోతివో'

వ: (పాడుతోంది)

కే: దానిపై సంగతి శ్యామసుందరాలోది——కానీ (వనకుమారి పాట అంతా పాడి ఆపింది) బావుంది, బావుంది- ఏదీ యదుకుల కాంభోజిలోనే యింకోటి వుండాలి

వ: ఆ యదుకుల కాంభోజి మీ భార్యగారు. నా కా రాగాల సంగతి తెలీదు. దాని మొదట లేదో చెప్పండి.

కే: అదేదో జ్ఞాపకం రావటంలేదు. పోనీ యింకోటి. కాని 'యింతిరో వాని మన——'(వనకుమారి పాడుతోంది) అమ్మో, పాడుతో అట్లా చివర న వ్వవొస్తేన లేదూ? ఆ దిగులు మావు వొద్దు. ఒక్కసారిగా కళ్ళల్లో దిగులూ, పెదవులమీద

నవ్వూ, ఎట్లా చూపుతావు? అభినయంలో నేర్పుతారా? (వన
సమారి పాడుతోంది)

వ: (పాటమధ్యలో) ఎమోటక్కరి పాటలు- ఒక రాముడిమీద
భక్తి కీర్తనా! పుణ్యమా, మోక్షమా? ఎందుకొచ్చిన పాటలు,
చచ్చుపాటలు! కృతులు నేర్పమంటే అయ్య నెవరో నవ్వాడు.
ఈజన్మంకూడా, పాపకూపంలో, యిట్లానే గడుస్తుందిగావును!
నామోచ్చారణచేతే జన్మలు నశిస్తాయంటారు అట్లా ఏమన్నా
వుండాలి నాకుకూడా ముక్తి! (పాడుతోంది)

కే: ఏదీ, ఏదీ, మళ్ళీ. ఆహా! యెంత గొప్పగా వుంది! నిన్ను
కాదు, ఆకంఠాన్ని కాదు; ఆ స్వరాన్ని ముద్దుపెట్టుకోవాలి.
ఎట్లా? ఎన్నిసార్లు నిన్ను కావిలించుకుంటే ఏంలాభం!

వ: సంగీతంలో యింత రసజ్ఞులే! మరి జీవితంలో కారేం?

కే: (బాధతో) కానా?

వ: ఐతే భోగందాన్ని యిష్టపడతారా?

కే: ఏమి—రసికత్వమూ, మాధుర్యమూ వాళ్ళదగ్గరే మిగిలింది.

వ: వుంటే నేం? వువ్వు దుమ్ములో అందరికాళ్ళకిందా నలిగిన
తరవాత—నన్ను చూస్తే నాకే రోతే! నన్ను చూసి యిష్ట
పడేవాళ్ళంటే, ఏదో, నా పాపనిరక్షణార్థం, యీశ్వరుడు పంపు
తున్నా డనుకుంటాను, మీబోటి ధర్మాత్ముల్ని.

('ఎంతటికులుకే' అని పాడుతోంది)

కే: అది వొద్దు. కాల్యాణి జావళీలకి బావుండదు. 'జాణా తనము' పాడు, కాఫీ.

వ: 'కాఫీ' ఏమిటి?

కే: (నవ్వుతో) దాని రాగం.

(వనకుమారి పాడుతోంది)

అక్కడ నొక్కు—యింకొంచం జాలిగా, మాయలాడి— అన్న చోట.

వ: (పాడి, ఆపి, 'నీ వెళ్లిపోయినావంటే' అని పాడుతోంది)

కే: అబ్బా! వొద్దు, వొద్దు.

వ: అది పాడుతోవుంటే నా కెట్లా వుంటుం దనుకుంటారు? ఆ నాయకుడిబాధ అంతా అర్థమౌతుంది. నేనే నాయికనై 'లేదు, లేదు, వొచ్చాను. వూరికే అట్లా తమాషాకి, నీ హృదయాన్ని పరీక్షించడానికి, అట్లా నిర్లక్ష్యం చేశా' నని కావిలించుకుని—

కే: వెళ్ళు ఆయనదగ్గిరికి.

వ: ఎవరి దగ్గిరికి?

కే: ఆ పాటలాయన దగ్గిరికి.

వ: అంత అదృష్టమా—కాని, యింత రసికులు మీకు యిష్టం లేవేం యీపాటలు?

కే: నీచశృంగారం.

వ : అయ్యో ! మా శృంగారం కంటేనా ! నీచురాల్ని గననేమో, ఒక్కచోటా నీచత్వం కనపడదు నాకు. ఈ యిల్లు, ఈ పూరు, యీ చీరెలు, యీ నాట్యాలు అన్నీమాని "వచ్చన్ని చేలోకి, వండువెన్నెల్లోన"— అంటుమామిడితోటలో, మల్లెంట్లల్లో, ఏతామెత్తేకాడ—అబ్బా ! నా మనసు ఎంత ఏడుస్తుందని ! ఒక్క మనిషి—నేను లేకపోతే—'తోటవ్రూసంటే సికాకూ'—అంటే, ఎన్ని పుణ్యాలు చేస్తే, ఎంత తపస్సు చేస్తే— నా చిన్న చిన్న అందాలన్నీ, నా చూపు, నా మాటలు 'ఎన్నాని చెప్పేది' అంటే ........

ఎందుకో యీ పాడుబతుకు ? ఎందుకు నాకాడో ఆ పాటలు ? ఎందుకో యీ ప్రపంచం ? ఆ ప్రపంచం 'చల్లన్ని యెన్నెల్లు' 'జిమ్ముమనే తోట చీకట్లు' ఆవులు, గడ్డిమేటి 'ఎలుతురుని నెమరేసే వళ్ళు' అవన్నీ నావీ, నారాజ్యం. నాకోసమే ఆ పాటలన్నీ.........

ఆకలేస్తోంది. వెళ్ళండి. పాపం మీ భార్యగారు వొంటరిగా వుంటారు, మీకోసం ఎదురుచూస్తో.

కే : అవును వెడతాను. ఇట్లా నీ కాళ్ళముందు పడివుంటే మరీ చవకై పోతాను

(లేచారు. దగ్గిరిగా వొచ్చాడు)

మళ్ళీ యెప్పుడు ?

వ: ఎప్పుడు మీ కనుగ్రహం కలిగితే అప్పుడు.

కే: ఎప్పుడూ నీదగ్గరే వుండా లని వుంటుందికద!

వ: అంత దయవుంటే, అదేచాలు; వుండాలా!

కే: కుమారీ! మన అనురాగానికి అంతం వుంటుందా! ఒకవేళ నేను చాలా బీదవాణ్ణై ఐపోయినా సనుకో. పోనీ, ఒకవేళ నేనే యేదన్నా తప్పుచేశా నని వుద్యోగం పోతుందనుకో—కాదంటా వేం—ఇల్లా భోగంవాళ్ళ యిళ్ళల్లో పడి వేడుస్తోవుంటే—చూశావా? మన ఆనందం, మన ప్రేమ ఎవరికర్థమౌతాయి? నిన్ను లంజ అనేస్తారు, చులకనగా! నన్ను పోకిరీ అనేస్తారు—నా వుద్యోగంపోయి, నేను బీదవాణ్ణయినా నీకు నామీద ప్రేమ వుంటుందా—లేకపోతే మీ కులాచారప్రకారం తలుపు తియ్యవా?

వ: మన స్నేహచరిత్రను జ్ఞాపకం తెచ్చుకుంటే—మీ ప్రశ్నకి ప్రత్యుత్తరం మీకే తెలుస్తుంది.
మరి ఆప్పైకం తీసుకొచ్చారా?

కే: తీసుకురాకండా వుంటానా?

(జేబులోంచి తీసి యిచ్చాడు.)

వ: (అతన్ని బుజ్జగిస్తో) చాలా అవసరం కనక అడిగాను.

కే: నాకు తెలుసుగా.

వ: ఎందుకు నామీద యింత మమకారం మీకు?— నా కృతజ్ఞత తెలిపేందుకు ఏం చెయ్యను?

కే: (చిరునవ్వుతో అర్థయుక్తంగా) తెలిపావుగా!

వ: అదా! అది మామూలు. అట్లానా —పవిత్రమైన కృతజ్ఞతాభావాన్ని తెలిపేది? ఛీ! యిట్లా రండి. (నెమ్మదిగా అతని కళ్ళల్లోకి చూస్తూ, ఆలోచిస్తూ అతని తలని వొంచి ముద్దు పెట్టుకుంది)

కే: మళ్ళీనా! ఐతే యింక కదలలేను. ఎట్లానన్నా నిన్ను మరిచిపోయి వెళ్ళా లనుకుంటూ వుంటే—

వ: యింక వెళ్ళండి; పాపం మీ భార్యాగారు చూస్తూవుంటారు.

కే: (ఆలోచించకుండా, పరధ్యానంగా) అబ్బా! వెళ్ళగానే గోల.

వ: గోలా, ఎందుకు? తగాదా పెట్ట రన్నారు.

కే: ఏడుస్తుంది. ఏదో పోనిమ్మని, నన్ను నాదోవని వొదిలెయ్య కూడదూ?

వ: ఆమెమీద ఎందుకు అసంతృప్తి కలిగింది?

కే: నిజం చెప్పనా? ఆలోచించాను, నా కెందుకీ దుర్బుద్ధి అని. ఈ కుల స్త్రీలకి పురుషుల్ని రంజించడం తెలీదు. ఎప్పుడూ పురుషుడి బలవంతమే కాని, వాళ్ళు కూడా ఆనందాన్ని పంచుకోరు. చిన్నప్పణ్ణించి, అదేదో పాపకార్యమూ, అసహ్యమూ అను

కోడంవల్ల, యింక పురుషుడు వూరుకోడుగనక దేహం వొప్పు చెప్పి వూరుకుంటూరు. కొన్నాళ్లైన తరవాత యేదో కొత్తే లేదు— అలవాటైపోతాం వాళ్ళకి. అబ్బా, ఆ నరకం భరించడం కష్టం. లోకమంతా యెన్నాళ్లు యీ వివాహసంస్థని నిలబెడుతోందోకాని !

వ : ప్రతిభార్యనీ, కొన్నాళ్ళు మాకింద తర్ఫీతుకి పంప మంటూరా యేమిటి ?

కే : నేను విద్యాధికారిన్నై తేనా, యీ విషయం ఆడవాళ్ళకి కాలేజీలు పెట్టించి, మిమ్మన్ని 'లెక్చరర'గా వేయిస్తాను.

వ : మాటలతో నాకడుపు నిండేట్టు లేదు. లెక్చరరువని వేయించిందాకా నన్ను మీరు పోషించవలిసిందే. వెళ్ళండి.

కే : వెళ్ళడమే మరిచిపోతా, నిన్ను చూస్తోవుంటే......నువ్వు ట్లాంటిదానినైనా, యెంతమందిలో—

(వనకుమారి అతనినోరుమూస్తోంది అతను వొదిలించుకున్నాడు. బైట శ్రీనివాసులు తలుపు కొడుతున్నాడు. వనకుమారి భయం కనపరుస్తోంది.)

వ : ఎవరో ?

కే : చూడరాదూ ?

వ : ఈవాలిటప్పుడు ఎవరు వొస్తారు ?

కే: ఏమి టా భయం, ఆకళ్ళల్లో: చప్పుడు విన్న లేడిపిల్లకళ్ళ లాగు — ఒక్కసారి యిట్లారా.

వ: వెళ్ళి చూస్తా.

కే: నిన్ను వొదలను.

(తలుపుకొడుతున్నాడు)

ఎవరో అల్లరికి, పోనిద్దూ. నిన్ను వొదలను: ఏం చేస్తావు? ఏమి టా భయం. నేను వుండగానే! ఎవరన్నా రానీ, రాక్షసుడు కాని, రుద్రుడుకాని—

వ: వుండండి, ఎవరో చూస్తాను.

(వెళ్ళింది. బైట శ్రీనివాసులుమాటలు. వనకుమారి బుజాల చుట్టూ చెయ్యేసి శ్రీనివాసులు తీసుకొచ్చాడు.

శ్రీనివాసులికి యిరవై ఐదేళ్ళు. చిన్నవాళ్ళు. కాని బల్లమైనది. ముఖాన రౌడీ వర్చస్సు. కళ్ళల్లో కొంచం వెర్రి. ఇప్పుడు బట్టల మీద రక్తం. తాగి వున్నాడు. అతనిస్థితి చూసి ఆమె కేశవరావు వున్నసంగతే మరిచింది.)

వ: ఆ గదిలోకి యెందుకు? ఆగు. ఏమి టా రక్తం? ఏం చేశావు? తొరగా చెప్పు.

శ్రీ: ఈ బస్తిమీద సవాల్! రమ్మను— యిట్లా రమ్మను- ఏ లంజ కొడుకు వస్తాడో! ...వనం...చూడు...నీ పే రేమిటి...వన మేనా...కాదు...మధువనం. (నవ్వుతున్నాడు.) మరువం...

చూడు...నన్ను వుత్తవెధవాయి అనుకున్నారు. తెలిసింది - ఈ వాల్టితో తెలిసింది...దాన్ని...నా దాన్ని... మాట అంటే పడుతుం దనుకున్నాడు... కర్నుడు- కలియుగ కర్నుడు - రణ కర్నుడు - దానకర్ను డుండగా. నరసింహామూర్తిని తాగుతా వెధవల రక్తం, తాగుతా. బస్తీమీద సవాల్ !

వ : ఏమిటిది ? ఏమి టీ రక్తం ? చెప్పవూ ?

కే : కుమారీ____

శీ : కుమారేమిటి ? కుమారీ - కుమ్మరీ - కుమ్మరిపురుగూ! సరిగా పిలు ! పిలవకపోయినావా - (వనకుమారి శీనివాసులు వీపుమీద చెయ్యేసి బతిమాలుతోంది.)

వ : శీ! నేనూ . వనాన్ని, తెలుస్తోందా ? (అధికారంతో) చూడు, నాకళ్ళవంక. అట్లా కాదు- తెలుస్తోందా ? చెప్పు - అంతా చెప్పు, నాతో-

శీ : వాడు - ఆ సాం...

కే : మళ్ళీ వొచ్చాడా వీడు ?

శీ : సాంబయ్య...నిన్ను తిట్టలా____వాడు - బతుకుతాడా- నిన్నంత మాట అని; బస్తీమీద - యీావట్నాంమీద - దేశం మీద. రండిరా, కుక్కల్లారా - రండిరా - మీ మీసాలు చూసి, మీమోటార్లు చూసి నేను దడుస్తా నట్రా-

వ : ఏంచేశావు ?

శ్రీ : కాఫీ తాగుతున్న వాణ్ణి, జుట్టుపట్టుకుని (నవ్వుతో) యిలా పడేసి— ఆ కప్పు యింకా నోట్లోనే— చూస్తున్నాను, నన్ను ; దెయ్యాన్ని చూసినట్టు. వా డొచ్చాడు, బూషిగాడు— తగూకి—...సరేగాని వీడు ఎందు కొచ్చాడు ?

వ : ఎవరవ్వా ? ఈయ న్నెగ కేక్కం? సరిగా చూడు. మన కేశవ రావు గారేగా !

శ్రీ : కేశవరావ్వూ ! ఎవ డది ? శవరావ్వూ !

వ : (కేశవ రావుతో) వెళ్ళ డి. మీరు వెళ్ళండి.

శ్రీ : పో, పో.

వ : మర్యాద నేర్చుకో ఏ మనాలి ? పంతులుగారిని.

శ్రీ : వెధవా, పొమ్మనాలి

వ : శ్రీ, శ్రీ! ఎన్నాళ్ళు చెప్పను ! 'వెళ్ళండి' అను. యింటికి వొచ్చిన వాళ్ళని యిట్టా అవమానంచేస్తావా ?

కే : ఎవడు వీడు ? నీకూ వీడికీ—

శ్రీ : (వనకుమారితో) అయ్యో ! దిగులే, వొద్దు - నవ్వు నవ్వు - పోరా. కాదు, పొండి, పొండి. అయ్యా! నీవని రేవులే! రేవూ నిన్ను నరకడం- ఇవాళిటికి తిను, పోయి- తిను, కాదు, తినండి.

కే : కుమారీ ! వీడు మళ్ళీ ఎందు కొచ్చాడు ? వొదిలిపోయినా డంటివే ! ఎవడు వీడు, సీతు ?

శ్రీ: ఎవడు ? ఏం కుమారి ? అదే నేను. నేనే అది. అంతే సంబంధం.

వ : మీరు వెళ్ళండి ; తరవాత చెపుతాను.

శ్రీ: నువ్వెట్లాగా; యీ అరుగుమీద యిట్లా కూచో - కదలకు. (అతన్ని తీసి కెదుటతోంది. హార్మోనియం దగ్గిరిగా వొచ్చారు)

శ్రీ: మళ్ళీ యీపాడుపెట్టె వాయిస్తున్నావా ? నాకు బావుండదన్నానా? నెధవసంగీతమూ, నువ్వూను. (హార్మోనియం పగలగొన్నాడు).

కే : ఏమి టిది - కుమారీ ? నేను మర్యాదస్తుణ్ణి. ఇట్లాంటి గోలలు నాకు సరిపడవు. వీణ్ణి పంపించెయ్యి.

వ : మీ కెందుకు ? మీరూ, నేనూ ఆనందంగా వున్నాం, కాదూ ? లేవు యెప్పటిమల్లేనే రండి. కోపం వుంచకండి.

శ్రీ: (కళ్ళు తెరిచి) పంపించు.

వ : వెడుతున్నారు. - వెళ్ళండి.

కే : కుమారీ ! నన్ను మోసంచేశావా? అందరిమల్లేనా నువ్వూ ! వూరుకోను - నే నూరుకోను ! నాడబ్బంతా నీ కెందుకు తగలెయ్యడం ? ఓసి దొంగముండా. ముందు వీణ్ణి పొమ్మను.

శ్రీ: (వులికిపడి) ఏ మన్నావు - నా మరవాన్ని ఏమన్నావు ? చచ్చావురా.

వ : వెళ్ళండి, వెళ్ళండి. శీనికి కోపమొస్తే- చాలా ప్రమాదం జరుగుతుంది.

కే : ఆ! నాకు భయం నేర్పుతావూ ?

వ : ఊరుకోండి.

కే : ఊరుకుంటా ! తప్పుకు లంజ.

శీ : ఆ, ఆ. (లేస్తున్నాడు)

వ : మీపాదాలు పట్టుకుంటా. నన్నే మనకండి. శీ చెడ్డవాడు.

కే : వెధవ, నన్నేం చేస్తాడు ?

శీ : ఏం చేస్తానా ? గొంతుపిసికి, నరికి యిక్కడే పాతేస్తాను. కృతయుగ అర్జునుణ్ణి నేను. రా, రా, యుద్ధానికి రా. ఇప్పుడే దీన్ని తిట్టిన వెధవని, పొడిచాను, చీల్చాను. రా, రా- నువ్వూ రా.

వ : కేశవరావుగారూ! వెళ్ళండి___పరిగెత్తండి.

(శీనివాసుల్ని కావలించుకుని అడుతోంది) శ్రీ, శ్రీ! నాకోసం, నీ వసంకోసం___

కే : నా ముందేటి___ఓసి లంజా___

శీ : అమ్మగో ! (కేశవరావు మెడపట్టుకుని వొంచాడు. వసంత మారి కేశవరావుని కాపిలించుకుంది)

వ: శ్రీ, నన్ను ముందు కొట్టు. (కేశవరావుతో) బాబూ, వెళ్ళండి. (శ్రీనివాసులు కేశవరావుని వొదిలాడు)

కే: ఏదికీ, నీకూ యేం సంబంధ మని—

శ్రీ: అదే మాట అంటావు--ఏం సంబంధమా—నేను కృష్ణుణ్ణి, అది సావిత్రి— నేను నలుణ్ణి, అది చంద్రమతి—నేను రావణుణ్ణి, అది రంభ. రంభేనా—అవును, రంభే అను; లేకపోతే చంపుతా—

కే: వాడిరంభ వటే నువ్వు?

శ్రీ: చచ్చావుగా, నువ్వు ఈ వాళ నీరక్తం కళ్ళ చూశా నన్న మాటే.

వ: శ్రీ, శ్రీ! నన్ను చంపు.

(శ్రీనివాసులు కేశవరావుని చేతిమీద ఒక పెద్దదెబ్బ కొట్టి, రెండుసార్లు కిందపడేసి, వీధుంలోకి నెట్టాడు. వొచ్చి వనకుమారిని కావిలించుకున్నాడు)

వ: వొదులు—

శ్రీ: వొదలను—నువ్వు నా దానివి—నిన్ను—నిన్ను—

వ: వొదులు, సిగ్గులేదూ? తప్పతాగి, వూరంతా అల్లరిచేసి, నన్ను ముట్టుకున్నావా? చూసుకో- బుద్ధిలేదూ. వొదులు ముందు. (వొదిలాడు)

శ్రీ: (వినయంగా) నామీద కోపమే?

వ: కోపమా? యింకానా. పో. నా మొహం చూడకు. పో.

శ్రీ: అట్లా చూడకు - నామీద కోపించకు. నీ కళ్ళు ఎర్రపడ్డాయా, నీ చంపలు జేవురించాయా, యీ లోకాలు అంటుకుంటాయి. వొద్దు- నే నోర్చుకోను; నావంక అట్టా చూడకు. మరిచిపోయినాను. బుద్ధితక్కువ. ఇంకెప్పుడూ—(ఏడుస్తున్నాడు) వెధవని-తుంటరి వెధవని- నన్ను కొట్టు, తన్ను అట్టా చూడకు.

వ: శ్రీ! లే. పద. స్నానంచెయ్యి.

శ్రీ: నీ పాదాల్ని వొదలను. నీదానుర్ని- నన్ను- నన్ను—

(వనకుమారి అతనిపక్కన కూచుంది)

వ: ఏమి టీ అల్లరి? అయింది చాలదూ? ఈయేసు పేమిటి? యింత దుర్మార్గుడ వైనా వేం?

శ్రీ: (లేచి) గోలీ చేస్తాను- చంపుతాను- అందర్నీ చంపుతాను- ఈబ స్త్రీమీద—

వ: పో, నీమొహాం చూడను, పో.

శ్రీ: వొద్దు, వొద్దు.

వ: మ రెందుకు తాగావు? మంచివాడి వైనా వని సంతోషిస్తే వుంటే—

శ్రీ: మరి ఆ సాంబయ్య- నిన్ను ఆ బూతుమాటలు—

వ: అంటే అన్నాడు. ఇంక నీతో యేమున్నా చెపుతానేమో చూడు.

శ్రీ: చెప్పకపోతే నేం? అందర్నీ తంతా; ప్రతివాణ్ణీ

వ: (కన్నీళ్ళతో) తంతాను, తాగుతా వనేకద! ఎన్నాళ్ళైనా, ఎంత బోధించినా, ఎంత బతిమాలినా- శీను, నాశీను! యింతే నా, యెప్పుడూ? ఎక్కడో, నరకంలో పడి, పాడై – నన్ను కూడా యిట్లా యీడ్చి—నీకోసం, నిన్ను సన్మార్గంలోకి తిప్పాలని—గుళ్ళో దేవికి అర్చనలు చేయించాను—వెంకటే శ్లుకి మొక్కుకున్నాను. యింతేలే! యీశ్వరుడికి దయలేదు, నామీద! మన ప్రయత్నా లేంలాభం?

శీను: (తెప్పిరిలుతో) ఏడవకోయ్, ఏడవకమ్మా! నీ శీనివా సులుకదూ! నే నుండగానే ఏడుస్తావేం? నేను మూడులో కాలూ ఏలుతో బతికివుండగానే యీదుఖం? రా, యిట్టా రా.

వ: పాపం, మర్యాదస్థుడు, ఆ కేశవరావు గారు.

శీను: ఆ కేశవరావుని, శవరావే చేశా. (నవ్వుతున్నాడు)

వ: మరి యింక తిండెట్లా, మనకి? ఈనెల యింకా అద్దె యివ్వ లేదుకద! ఆ గూట్లో రెండురూపాయలు తప్ప—

శీను: (సిగ్గుతో) అవి నేను తీసుకుపోయినాను.

వ: తీసి కెళ్లావూ? ఏం తిందాం?

శీను: ఇవ్వడూ — డబ్బివ్వడూ? ఎట్లా యివ్వడో చెపుతా! వాడి గొంతు పిసికి, వాడి పెళ్లాం నగ లమ్మి—(లేస్తున్నాడు)

వ: కూచో, అన్నా! కూచో. (కూచున్నాడు)

శ్రీ: (నెమ్మదిగా) వాడి గొంతుపిసికి—

వ: నోరు ముయ్యి. ఎవర్నీ చంపొద్దు కాని, నామాట విను. ఇవి చూడు. (నోట్లు చూపించింది)

శ్రీ: ఎక్కడివి? యింకేం! అర్థ యియ్యి.

వ: నీజూదంఅప్పు లేదూ, అది తీర్చడానికి! అర్థె? మరి ఆయన్ని కొట్టావుకద!

శ్రీ: నా అప్పు తీర్చడానికే! నీ చీర వొదిలించుకోడానికి కాదూ? బుద్ధి లేదు, నాకు, చండాలుణ్ని.

వ: శ్రీ...ఎప్పుడో యిలాంటివనులు చేసి జైలులోకిపోతావు, నన్నువొదిలి. ఎల్లా నీతో! - ఎంతో మంచివాడ వవుతావు, నన్ను పోషిస్తా వనుకుంటున్నానుకద! నన్ను- రోజుకి మూడు ణాలు, రొండణాలు తీసుకొ స్తే - యిక్కణ్నించి - యీ చీదర లోంచి - యీపాపంలోంచి వెళ్ళిపోదాం. ఎప్పటికైనా నిర్మ లంగా యీశ్వరారాధనచేస్తో, యెల్లానన్నా వున్నతమైన జీవి తంలో పడదాం......నా నగలన్నీ అమ్మితే, నా చీరెలన్నీ అమ్మితే—

శ్రీ: అమ్మనియ్యను.

వ: వినమంటే - తక్కినఖర్చులు నేను సంపాయిస్తా,యీలోపల. వాటితో మనం యెక్కడికో- యే గంగాతీరానికో వెళ్ళి ఒక చిన్న స్థలం కొనుక్కుందాం. అటు నది ఒకపాయ మనతోట యిసెక

గుండా చల్లగా ప్రవహిస్తోవుంటుంది. చిలకలూ, అన్నిపక్షులూ, కోవెలలూ ఎప్పుడూ కూస్తోవుంటాయి. ఆవుల్ని కొందాం. గడ్డిమేటి వేద్దాం. చామంతులూ, మల్లెలూ, సంపంగీ, గులాబీ, అన్నిపువ్వులూ పూస్తాయి. అట్లా వెన్నెళ్ళలో, యేటిపక్క బయిళ్ళలో, యింట్లో ఆనందంగా వుండదూ ? ఈశ్వరుడికి చిన్నగుడి కట్టి, భజనలూ స్తోత్రాలూ చేసుకుంటో-ఎప్పటికో ఆ అదృష్టం !

శ్రీ : యింకెవరూ వుండరూ ?

వ : ఎవరూ వొద్దు. మనిద్దరమే. చాలదూ ?

శ్రీ : వంటొస్తుంది ? పూరన్నా దగ్గిర వుండకు.

వ : వొద్దు. తోచడానికేం, తోస్తుంది. కొంతకాలమయింతరవాత- యేమో- దుర్గకరుణిస్తే- ఒక చిన్న పాప, వుంటుందేమో!

శ్రీ : మనకే ! పిల్లలే !

వ : అదుగో ! అంత వొంటరిగా వుండలేవు. అవునా ?

శ్రీ : నీ కోసం.

వ : కాని, అన్నీ కలలే- కలలే- అన్నీ కలలే !

— తెర —

## 'త్యాగం'

### మూడో రంగం

[రాత్రి పదిగంటలు అంతా మొదటిరంగంలాగే వుంది. సీతారత్నం మంచందగ్గిరిగా కూచుని రామాయణం చదువుతోంది. ఉత్తరరామాయణంలో రాముడు వొదిలినప్పుడు సీత యేడవడం.]

భ్ర: అదుగో! మీ ఆయన వొచ్చాడు.

సీ: యింత తొందరగా వొచ్చారే యీవాళ!

భ్ర: మరి రామాయణం చదివిన ఫలం!

(భ్రమరాంబ వెళ్ళింది. సీతారత్నం సైఖరి మార్చింది. షోకులు తగ్గాయి. కేశవరావు వొచ్చాడు. కోపంతో విసురుకుంటూ వొచ్చాడు. చెప్పు లోమూల విసిరాడు. కండువా పారేశాడు.)

కే: ఏం, స్నానానికి నీళ్ళు వున్నాయా?

సీ: సిద్ధంగా వున్నాయండి.

కే: నువ్వు భోంచేశావా, లేదా?

సీ: లే దింకా.

కే: ఏం చెప్పాను, నీకు: నేను వొచ్చేదాకా వుండవొద్దన్నానా? బుద్ధిలేదూ? మళ్ళీ తలనొప్పి అని మూలిగి నాదుంప తెంచుతావు. వెధవసంసారం! పాడుగోల పట్టుకుంది.

(కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళిచ్చింది. కాళ్ళు కడుక్కోగానే తుడిచింది)

కే: ఇవన్నీ నా కేం చెయ్యనక్కర్లేదు- వెళ్ళు.

సీ: స్నానానికి రండి.

కే: అక్కర్లేదు.

సీ: ఇప్పుడేగా అడిగారు.

కే: నా యిష్టం.

సీ: మరి భోజనం చేస్తారా?

కే: చెయ్యను.

సీ: ఎందుకు?

కే: పో—నువ్వు మాట్లాడకండా పోయి భోజనం చెయ్యి.

సీ: మీరు చెయ్యకండానా?

కే: నన్ను విసికిస్తా వేం? తన్నులు కావాలా? బుద్ధిలేదూ?

సీ: సరే, మీయిష్టం. బతిమాలుకుంటూ; నామాట వినండి.

కే: నోరుముయ్యి.

(వూరుకుంది)

సీ: పాలు తాగుతారా?

(యిచ్చింది. తాగిం తరవాత తాంబూలం యిచ్చింది)

కే: పెట్టిలో డబ్బెంత వుంది?

సీ: పదిరూపాయిలనోటూ, చిల్లరా వుంది.

కే : మొన్ననేగా యాభై రూపాయలిచ్చాను. ఏం చేశావు?

సీ : నే నేం చేశాను ? మరి బస్తాబియ్యం, చాకలాడికీ—

కే : యింతకర్చా, యిద్దరికీ ! ఎక్కడ సంసారం దాపరించింది, నాకు !

సీ : (వినయంగా, భక్తిగా) పడుకుంటారా ?

కే : నిద్ర రావడం లేదు. నీ చదు వేదో యేడుసుకో. నా జోలెందుకు ? (సీతారత్నం చదువుకోడానికి కూచుంది. కేశవరావు పచారుచేస్తున్నాడు. ఆమె రామాయణం బిగ్గరిగా చదువుతోంది)

కే : (కొంచం సేపుండి) అబ్బా! బిగ్గరిగా చదవకు—గోల.
(సీత లోపల చదువుకుంటోంది.)

కే : నీ మిరియాలపేరు ఎన్ని కాసులు ?
(సీత వినలేదు)
నిన్నే ! నీ మిరియాలపేరు ఎన్ని కాసులు ?

సీ : ఇరవై మూడు. యిప్పు డెందు కా సంగతి ?

కే : ఎందుకోలే. నీగోల నువ్వు ఏడ్చుకో.
(మరిచిపోయి సీత మళ్ళీ బిగ్గరిగా చదువుతోంది.)

కే : అంతా అబద్ధం.

సీ : ఏమిటి ?

కే: పతివ్రతలూ లేరు. ఎవరూ లేరు. అబద్ధాలు రాశారు, పుస్తకాలనిండా. సీతట! అందరాడవాళ్లూ దొంగలే! లోక మంతా—

సీ: సీతాదేవి—

కే: సీతా అంతే, పీతా అంతే! ఆడదైతే సరి!

సీ: కళ్ళు పోతాయి, అట్లా అనకండి. వినండి- (చదువుతోంది.) మీరు వినటంలేదు.

కే: లేదు, లేదు. వింటున్నా. (ఆమె చదువుతోంది కొంచెం సేపటికి ఆపింది)

సీ: ఏదో ఆలోచిస్తున్నారు. ఏదో, మీ ముఖం మారింది కూడాను. ఎప్పుడూ యిట్లా లేరు. విచారం బాధిస్తోంది. మూర్ఖు రాల్ని. అది గుర్తించక గుడ్డిగా చదువుతున్నాను. (పుస్తకం కింద పెట్టింది)

కే: ఏమీలేదు- నిజం. వింటున్నాను- చదువు- ఏమంటావు?

సీ: (లేచి)నాదగ్గిర దాస్తారా? ఇట్లా కూచోండి. అంతమాత్రం కనిపెట్టలేనూ?

(సీతారత్నం వుత్సాహంగా వుంది. అతన్ని మంచంమీద కూచో పెట్టి పక్కన నుంచుంది).

సీ: ఏమిటి చెప్పండి. ఎందుకట్లా వున్నారు? నావల్ల ఏమన్నా అపచారం జరిగిందా?

కే: ఛా, ఛా. నువ్వే ఏం లేదు. కొంచం అలిశాను.

సీ: (అణుచుకోలేని బాధలో) అదా !...(ప్రియత్న పూర్వకంగా) వినరనా? యింకా పాలు కావాలా? కాళ్ళుతీపులు, అవునా?

(కేశవరావు పరధ్యానంగా వున్నాడు; చిన్నబోయిన మొహంతో సీతాకాంతం కిందకూచుని కాళ్ళు పడుతోంది.)

సీ: బావుందా?

కే: అక్కర్లేదు.

సీ: ఇట్లాంటప్పుడు నాన్నకి తీపులుగా వుండేవి.

కే: యాభై యేళ్ళ మీ నాన్నా, నేనూ వొకటా?

సీ: కాదు లెండి. ఇంకా చిన్నప్పుడూ అంతే.

కే: నా కేమీ నొప్పులు లేవు. వొదులు.

సీ: పోనీ, నాకు ఆనందంగా వుంటుంది.

కే: ఏమిటి అందరికాళ్ళూ పడితే ఆనందమా! వడ్డిమంగలిదానవా?

సీ: అందరి కాళ్ళూనా! మీపాద సేవకురాల్నికద నేను.

కే: అదేమిటి: పుస్తకంలో లాగు అట్లా మాట్లాడ్డం నేర్చుకున్నావు?

సీ: పాపం- అలిసిపోయినారు...అ - వుండండి.

డ్రాయరు తెరుస్తో తనలో తను మాట్లాడుకుంటోంది) దుర్మార్గురాలు. యీయన అలిసిపోతే దానికేం! పశువు. ('సిగార్ ఒకటి పైకి తీసి, అగ్గిపెట్టెతోసహా తీసుకొచ్చి, కేశవరావు నోట్లో పెట్టి వెలిగిస్తోంది.)

కే: యి దెక్కడిది సీతా? దీనిపొగజూస్తే వాంతిచేసుకుంటావుగా!

సీ: అవాళ మీరు పొగకాల్చి, న న్నేడిపించాలని తెచ్చారా, నన్ను కొట్టినరోజు! ఆ దూకుళ్ళో దీన్ని యిక్కడే కిందపడేసి వెళ్లారు.

కే: అది దాచావా, పిచ్చిపిల్లా!

సీ: అమ్మా అంతే, మీరు అంతే, నన్ను 'పిచ్చిపిల్లా' అంటారేం? అంత తెలీనిదాన్నా!

కే: నిజంగా తెలీనిదానవే. (ప్రేమగా, ఇంత తెలీని పెళ్లాం ఎవరికీ లేదు.

సీ: మూర్ఖురాల్నే—

కే: ఛా, లోకజ్ఞానం లేనిదాన వన్నమాట.

సీ: మరి లోకం ఏం చూపారు, జ్ఞానం రావడానికి!

కే: పాడులోకం, పోనిద్దూ! చూడకపోతేనే మంచిది.

సీ: మీకు, కులాసాగా వుందా, యిప్పుడు? ...లేదు, యింకా మొహమే చెపుతోంది అసంగతి.

(మళ్ళీ అలమారు తెరచి గ్లాసులో మర్బతు పోసి తీసుకొచ్చి తాగిస్తోంది.)

కే: ఏమిటే, వుపచారమంతా; నా కెందుకూ—ఇట్లా కూచో నీ కెందుకు యీ శ్రమంతా!

(పక్కన కూచో పెట్టుకున్నాడు)

సీ: మీ శ్రమంతా నాదే. నాతో చెపితే నేనూ పంచుకుంటాను. అప్పుడు సగ మవుతుంది.

కే: కాదు. ఒక పొయ్యిలోనుంచి యింకో పొయ్యి వెలిగిస్తే మంట సగమవుతుందా?

సీ: మంట వున్న దన్నమాట. చెప్పండి ఐతే: ఎవరిమీదో, ఏమిటో?

కే: ఎంతైనా, ఆడది కూతురు

సీ: పిచ్చిదాన్ని — యీ పై వుపచారాలన్నీ చేస్తున్నాను. ఏమి టా బాధ?

కే: నీతో చెప్పి ఏంలాభం?

సీ: స్నేహితులతో చెప్తుకుంటారే; ఏం లాభం?

కే: వాళ్ళతో వేరు. వాళ్ళ కర్థమౌతుంది. సహాయం చేస్తారు.

సీ: నా కర్థం కాదు. ఊరికే వాగే ఆకోతులకన్న నాకు తెలివి లేదా? మరి అర్థంచేసుకునే జ్ఞానం యివ్వరాదా? వేరిమ వున్నన్నాళ్ళూ, అనుకుంటారు, మా బుగ్గలతో, మాజుట్లుతో.

డ్రాయరు తెరుస్తో తనలో తను మాట్లాడుకుంటోంది) దుర్మార్గు రాలు. యీాయన అలిసిపోతే దానికేం! పశువు. ('సిగార్ ఒకటి పైకి తీసి, అగ్గిపెట్టెతోసహా తీసుకొచ్చి, కేశవరావు నోట్లో పెట్టి వెలిగిస్తోంది.)

కే: యి దెక్కడిది సీకు? దీనిపొగజూస్తే వాంతిచేసుకుంటావుగా!

సీ: అవాళ మీారు పొగకాల్చి, న న్నేడిపించాలని తెచ్చారా, నన్ను కొట్టేసరోజు! ఆ దూకుళ్ళో దీన్ని యిక్కడే కిందపడేసి వెళ్లారు.

కే: అది దాచావా, పిచ్చిపిల్లా!

సీ: అమ్మా అంతే, మీారు అంతే, నన్ను 'పిచ్చిపిల్లా' అంటా రేం? అంత తెలీనిదాన్నా!

కే: నిజంగా తెలీనిదానవే. (ప్రేమగా, ఇంత తెలీని పెళ్లాం ఎవరికీ లేదు.

సీ: మూర్ఖురాలేన్నా—

కే: ఛా, లోకజ్ఞానం లేనిదాన వన్నమాట.

సీ: మరి లోకం ఏం చూాసారు, జ్ఞానం రావడానికి!

కే: పాడులోకం, పోనిద్దూ! చూడకపోతేనే మంచిది.

సీ: మీాకు, కులాసాగా వుందా, యిప్పుడు? ...లేదు, యింకా మొహమే చెపుతోంది అనంగతి.

(మళ్ళీ అలమారు తెరచి గ్లాసులో మర్బతు పోసి తీసుకొచ్చి తాగిస్తోంది.)

కే: ఏమిటీ, వుపచారమంతా; నా కెందుకూ—ఇట్లా కూచో నీ కెందుకు యీ శ్రమంతా!

(పక్కన కూచో పెట్టుకున్నాడు)

సీ: మీ శ్రమంతా నాదే. నాతో చెపితే నేనూ పంచుకుంటాను. అప్పుడు సగ మవుతుంది.

కే: కాదు. ఒక పొయ్యిలోనుంచి యింకో పొయ్యి వెలిగిస్తే మంట సగమవుతుందా?

సీ: మంట వున్న దన్నమాట. చెప్పండి ఐతే: ఎవరిమీదో, ఏమిటో?

కే: ఎంతైనా, స్త్రీడవు కూతురు

సీ: పిచ్చిదాన్ని — యీ పై వుపచారాలన్నీ చేస్తున్నాను. ఏమి టా బాధ?

కే: నీతో చెప్పి ఏంలాభం?

సీ: స్నేహితులతో చెప్పుకుంటారే; ఏం లాభం?

కే: వాళ్ళతో వేరు. వాళ్ళ కర్థమౌతుంది. సహాయం చేస్తారు.

సీ: నా కర్థం కాదు. ఊరికే వాగే ఆక్రోతులకన్న నాకు తెలివి లేదా? మరి అర్థంచేసుకునే జ్ఞానం యివ్వరాదా? ప్రేమ వున్నన్నాళ్ళూ, అనుకుంటారు, మా బుగ్గలతో, మాజుట్టుతో.

అది పోగానే, అప్పుడర్థమౌతుంది మేం బొమ్మలకంటె ఏమీ గొప్ప కామని—అందుకు తప్ప వుపయోగం లేదని. స్త్రీ తన హృదయంతో అర్థం చేసుకున్నట్టు పురుషుడు చేసుకోగలడా! మీరు నా దైవం—నా శ్రీరామచంద్రమూర్తి—మీరు నా హృదయదీపం—నా లోకకల్యాణం.

కే: నిజమా—నన్నింకా అట్లా అనేవాళ్ళు లోకంలో ఒక రున్నారా? నిజమా—ఆమాటలు—ఇంక ఒక్క హృదయం లోనన్నా గౌరవ ముందా నాపైని.

సీ: కొంచ మనుకున్నారా? ఈ జీవితమంతా మీదే! (పాదాల మీదికి జారుతోంది. కేశవరావు ఆమెని ఎత్తుకుని ముద్దుపెట్టుకో బోయినాడు. సీత చేతుల్లోంచి దూరి దూరంగా వెళ్ళింది)

కే: ఎందుకు దూరమౌతావు? నాకు తెలును—నీకుకూడా అసహ్యమే. నిన్నింత యేడిపించి—

సీ: కాదు, కాదు.

కే: యేడిపించి, నీ ప్రేమనంతా కాలుకింద రాసి, చంపి... అవును...యీ పశువుని...

సీ: కాదు, వినండి.

కే: పశువుని యెవరు తాకనిస్తారు!

సీ: (అతన్ని కావిలించుకుంటో) అంటారా అట్లా? ఇవ్వుడనండి.

కే: నిజంగా యిష్టమే?

సీ: (చప్పున వొదిలి దూరంగా నుంచుని) అది కాదు మీకు నామీద మనసులేంది, నన్ను సంతోషపెట్టడానికి కావిలించుకో నక్కర్లేదన్నాను. కాని మీరు నన్ను కావిలించుకునే సంతోష పెట్టాలా ? మీ రూపం చాలదూ ? నామనసులోని మీ భావం చాలదూ ?

కే: ఈ కొత్తమాటలన్నీ ఎక్కడ నేర్చుకున్నావు ? ఎందు కిట్లా మారావు ?

సీ: యిట్లామారడం బావుండలేదా ? పోట్లాడితేనే బావుందా ?

కే: అట్లానే వుంది—

సీ: పోట్లాడ మని ఆజ్ఞ ఐతే - (ఆగింది)

కే: ఐతే-

సీ: అది చాతకాదు.

(ఈ సంభాషణలో ఆట్టే మనసు లేకండా మాట్లాడుతో వుంటాడు కేశవరావు)

(కొంచం వూరుకున్నారు. కేశవరావు ఆలోచిస్తున్నాడు. సీతారాం ఆలోచిస్తోంది. కేశవరావు మొహంలోకి దీనత్వం వొచ్చేస్తోంది.)

కే: నన్ను తుంచగలవా ? అన్నీ మరిచిపోయి - ఒక్కదానికీ కోపంవుంచుకోక-

సీ: (అతనితలని కావిలించుకుని) ఏమీ ? జ్ఞాపకముంటేనా, మరిచి పోవడానికి ! ఎప్పుడన్నా కోపంవొస్తేనా పోవడానికి.

(ఆమె రొమ్ములో తలపెట్టుకుని ఏడుస్తున్నాడు. ఆమె పమిట తొలిగిపోయింది. రవిక తడిసిపోయింది. చేతులు అతనిమెడని రెండు వేపులా గట్టిగా వాటేసుకుంటున్నాయి. ఆమెపెద్దజుట్టు యిద్దర్నీ కప్పుతోంది)

(మాట్లాడకుండా కొంతసేపు వూరుకున్నారు. కేశవరావు యేడుపు గుక్కలు వినపడుతున్నాయి)

సీ : ఏడుపెందుకోయ్? అంతవిచారమే! అంతవిచారమే! ఇక్కడ పడుకో. నాబాబు లోకంలో అలిసివొచ్చాడు-ఇక్కడ విశ్రాంతి- ఇక్కడే బలం- యిక్కడే అమృతం — అన్నీ వున్నాయి. వెధవ లోకం! మనుషుల్ని మాడ్చిచంపుతుంది. నేనే లేకపోతే, పాపం- పాపం- యేమయ్యేవాడు.

కదలకండి- అట్లానే వుండండి. ఈనిముషాల్ని అట్లా నిద్రపోనిండి.

(మళ్ళీవూరుకున్నారు. ఆమెచేతులు అతని వీపు మెల్లిగా రాస్తున్నాయి. సగంమూసిన ఆమెకళ్ళలో గొప్ప శాంతి కనపడుతోంది.)

కే : నామీద ప్రేమచూపకు. నేను అసహ్యుణ్ణి- దరిద్రుణ్ణి. నన్ను గౌరవించకు. నిన్ను-

సీ : ఇంకెవర్ని గౌరవించను? మీరు- మీరే నాభర్త- మీరు నాదైవం- నా శ్రీరామచంద్రమూర్తి- మీరు నాహృదయదీపం, నాలోకం, నాకళ్యాణం-

(అతని చేతుల్ని తీసుకుని ముద్దుపెట్టుకుంటోంది.) ఇవన్నీ నావే! ఏంచేస్తే నేం? ఎక్కడ తిరిగితే నేం? అంతా మాయ! ఒక్క భక్తే, ఒక్క పాతివ్రత్యమే. యీ హృదయంలో, మీరూప ధ్యానమే నిజం! ఏం చేస్తేనేం? నన్ను చంపితేనేం... వెళ్ళండి... దాన్ని తెచ్చుకోండి. ఇక్కడే పడుకోండి, యిద్దరూ. విసురు తాను, సేవచేస్తాను, మీయిద్దరికీ—

కే: వుండు, వుండు. వొద్దు.

సీ: ఏమి టాబాధ? నేను మాట్లాడను పోనీ (చేతులు రాస్తోంది. కొంచం వూరుకున్నారు)

కే: (చప్పున లేచి) చంపుతాను. చంపేస్తాను, నరుకుతా...

సీ: ఏమిటి? ఏమి టిది? వూరుకోరూ?

కే: వుండు—అడ్డుపెట్టకు—ఎవరడ్డమొస్తారో రానీ—

సీ: చంపండి—నరకండి—

కే: ఎవర్ని?

సీ: నన్ను.

కే: నిన్నా...ఛా...ఛా...నిన్నా—

(సీత అతన్ని కూచోపెట్టి సముదాయిస్తోంది)

సీ: ఎందుకా కోపం? నామీద తీర్చుకోండి నెమ్మదవుతుంది. వాళ్ళు వూరుకుంటారా? మరి సరికితే. మాట్లాడకండా పడుకోండి. మీ రిట్లా నాదగ్గిరికి వొస్తే ఎంతబావుంటుంది.

(కేశవరావు మళ్ళీ పడుకున్నాడు)

మీా కింకా విచారం పోలేదు. నాతో చెప్పండి.

కే: ఎందుకు? ఏం లాభం?

సీ: మీా కావిచారం తగ్గుతుంది. ఎంతబాధ, పాపం!

కే: ఛా, ఛా, నీతోనా? ఎట్లా చెప్పను?

సీ: చెప్పండి. ఫరవాలేదు...ఏం చేసింది?

కే: ఎవరు?

సీ: అదే—ఆ వనకుమారి—

కే: నీ కెట్లా తెలుసు?

సీ: తెలుసు—

కే: (క్రోధంతో) ఎట్లా? చెప్పు ముందు.

సీ: యిం కెవరున్నారు, మిమ్మల్ని వేడిపించేందుకు? చెప్పండి. మీాబాధ పోగొడతానుగా.

కే: (నెమ్మదిగా) నీ కేంచాతనవుతుంది?

సీ: నేను ప్రేమిస్తున్నాను గనక, నాచేతనే అవుతుంది. ప్రేమలో అన్నీ కరిగి మాయ మౌతాయి. చెప్పి చూడండి.

కే: అది.....ఏమనుకోక—

సీ: ఆ—

కే: అది నన్ను........ఏంలాభం? చెప్పను. నీతో చెపితే మాత్రం, యీామంట ఎట్లా చల్లారుతుంది.

సీ: అట్లా అనకండి ఇంట్లో కూచుంటుంది, ఆడదానికేం చేత నవుతుంది అనుకోకండి. అమూల్యాలు, సహజంగా యీశ్వరు డిచ్చిన అమోఘవరాలు-యీ శరీరం, ప్రాణం, మానం వున్నాయి.

కే: ఆ ముండ—అది నన్ను వొదిలేసింది.

సీ: (బాధతో) అందుకా మీరు దుఃఖించడం! (నొచ్చుకుని చేతులు వొదులుచేసింది)

నీచురాలు, అధమురాలు, అది—

కే: కాదు. అది వుత్తమురాలే—

సీ: కాదు. మిమ్మన్ని వొదిలి మీ కింత బాధకలిగించిన దుర్మతి—

కే: నీకు దానిహృదయం తెలీదు. నన్ను ఎప్పుడుకూడా, నా మొహాన్ని, అందాన్ని, నా తెలివిని—

(సీత బాధ పడుతోంది.)

సీ: ఐతే ఎందుకు వొదులుతుందేం? ఈమంచికళ్ళని, ఈ నిర్మ లాంతఃకరణాన్ని వొదిలింది. మళ్ళీదాని కీజన్మంలో యింత అదృ ష్టం, పెన్నిధానం, దొరుకుతుందా? మీరు పొరబడ్డారుగాని—

కే: అది మంచిదే. కాని యింకో దుర్మార్గుడు, పరమపాతకి-వాడు-

సీ: వాడికోసం మిమ్మన్ని వొదిలిందా? ఇంకా దాన్ని ఉదారు రాలు అని పొగుడుతారు. ఎంత మంచి హృదయంమీది!

కే: అ దేం చెయ్యలేదు, పైగా అడ్డపడ్డది. వాడు నన్ను యీడ్చి...

సీ: ఈడవడమే!

కే: అంటే, యీడవలేదులే- నేనే తన్నా ననుకో-

సీ: ఇం కేం! మరి యింక-

కే: అంటే- నేనే గెలిచా ననుకో. కాని, అక్కడ...చూడు, అవి బోగ వాళ్ళ యిళ్ళు. పదిమందీ పోగవుతారు. అందుకని వూరుకున్నాను గాని-

సీ: వూరుకున్నారా?

కే: వాడి కెంత బలమని! కాని యిప్పు డూరుకోను. నేను వూరుకునే మనిషిని కాను. దాని- దాన్ని- యిద్దర్నీ కోసేస్తాను- కత్తితో నరికేస్తాను.

సీ: పాపం! దా న్నెందుకు?

కే: అదే, అదే- దాని కోసమే! దానికీ వాణ్ణే చూ స్తే యిష్టమే.నన్ను మోసంచేసి,నాడబ్బంతా తింటో, నాముందే... దాన్ని డొక్కలో పొడిచి, చంపి- కళ్ళుగుటలుగా తవ్వి-

సీ: ఎందు కాకోవం? దానికేం తెలును, పాపం! దానిజన్మే అట్లాంటిది. మీరు కో స్తేమాత్రం...

కే: వుండు, వుండు. న న్నది చేసినద్రోహానికి, దాన్ని ముక్కలు ముక్కలు చే స్తేమాత్రం...

సీ: క్షమించండి. దాన్ని క్షమించండి. దాని లెఖ్ఖేమిటి? దాని గుణం అది చూపుకుంది. మీరు కూడా యింత ఆగ్రహ పడి, మీ శాంతాన్ని నాశనంచేసుకుంటారా?

కే: శాంతం కాదు. శాంతంవల్లే తన్నులు తిని బ్రతుకుతున్నాను- రాత్రి రహస్యంగా నిద్రపొయ్యేప్పుడు—

సీ: వినండి. మీ ఆత్మ నాశనం చేసుకోకండి—పోనీండి—ప్రేమ చూపండి...

కే: లే, వాములు. వెళ్ళనీ. యిప్పుడే...

సీ: నా కంఠంలో ప్రాణ ముండగా వీల్లేదు ..

కే: (తోసేసి) పో, వాదులు—అడ్డురాకు అట్లాంటి మణి - దేదీప్యమాన విగ్రహం—దాన్ని విడిచి బతికగలనా? లే, అందరూ—వూరంతా నవ్వేరూ? చచ్చాడు—అదీ చచ్చింది- నా చేతుల్లో.

సీ: కొట్టండి—నన్ను పొడవండి. మీ కేలపాయం కలిగినా నేను సహించను మీ కోపం నావంటిమీద తీర్చుకోండి.

(కేశవరావు చప్పున సీతారాంని కావిలించుకున్నాడు)

సీ: శాంతించండి. నామీద దయచూపనే అక్కర్లేదు. మీరు శాంతించండి. అదే చాలు నాకు.

కే: గా, నా వొళ్ళు మరిచిపొయ్యాను. ఛీ, ఛీ, ఆ ముండ నాకెందుకు? నాకు వొద్దనే వొద్దు రా! నిన్ను తన్నానా?

సీ: మీరు వుపశాంతిగా వుంటే యింకా తన్నండి. యీదేహం మీది. నాది కాదు—

కే: తన్నాను. నన్ను క్షమించు—

సీ: నామాట వినండి. చంపుతాను, చంపుతానంటారు. ఎవర్ని చంపుతారు? ఎవ రది? మీరే! నేనే! వా డెవరు? మీరే! అందరూ - అందరూ- శ్రీరాముడే! చంపే దెవరు? చంపించు కునే దెవరు? అయ్యో పిచ్చివారా! మిమ్మన్ని మీరు పొడుచు కుంటారా? పోనీ, చంపితేమాత్రం, అది మీ దవుతుందా? దాని హృదయం మారుతుందా? మిమ్మన్ని పాపం చుట్టుకో డంకన్నా ఫలిత మేమిటి? వాళ్ళిద్దరిమీదా దయచూపండి. నేను వొండుతాను, ఫలహారాలు పంపండి. నేనూ వొస్తాను.

కే: నీకేం మతిపోయిందీ. వాడికి ఫలహారాలా? ఫలహారాలే! ను వ్వెంతన్నా చెప్పు, నా కోపం ఆగదు. వాడి కెల్లానూ నాచేతు లో చావు రాసిపెట్టి వుంది.

సీ: పోనీ, యీమాట వినండి. చంపాలా? నామాట వినండి, చివరదాకా చంప వొద్దనటంలేదు. సరే. వాణ్ణి చంపనే చంపవలసివొస్తే, మీ కానిశ్చయమే ఐతే, కానీండి. నేను మీ దాసిని, మీవిధేయురాల్ని; నే నుండగా మీ రెందుకు చెయ్యి చేసుకోడం? నేను చంపుతా, నన్ను చంపనీండి...మీరు— వారు, మిమ్మన్ని ఆపదలోకి పంపుతానా? యిట్లా...యి ట్లా...దాచుకుంటూ. కాని కట్టేస్తా ననుకోండి. మీయిష్టం

మీాయిష్టం. కాని మీా బాధలు కోపాలు, అన్నీ భరిస్తాను. ఏమంటారు?

(కేశవరావు మాట్లాడకండా పడుకున్నాడు)

దాన్ని చంపుతా నన్నారు కదా, నిజంగా చంపుతారా? పోనీ, నేను చంపనా దాన్ని? అమ్మో. మీారు ఒప్పుకుంటారా? నాకు తెలీదూ? ఆకోప మంతా విరిగి పోయిన ప్రేమ! నిజంచెప్పండి. అవునా? నాకు తెలీదూ? దా న్నింత ప్రేమించకపోతే యింత ఆగ్రహిస్తారు?

కే: అబ్బా! నేను భరించలేను. ఈ బాధ నీ కర్థంకాదు. ఎంత మోసం చేసింది! ఎంత నమ్మించింది. వాడు రాకముందే, అంతకు ముందే—'మిమ్మన్ని చూసి ఏస్త్రీ మోహించదు? ఏ హృదయం మిమ్మన్నించి వియోగడపడి మరణించదు?' అంటోంది అంతా అనృతం. ఇప్పటికీ నమ్మలేను. ఎట్లా అంతనూనృతహృదయంలో యింతకాపట్యం దాచిందో! నా తిండి తింటో, నా బట్టకడుతో అన్నాళ్ళూ—అన్నాళ్ళూ—నాముద్దుమాట లన్నిటినీ వాళ్ళిద్దరూ వెక్కిరించుకునేవాళ్ళు గావును! నాఫలహారాలు తినినా వెర్రితనానికి, నా గుడ్డితనానికి నవ్వుతో... అట్లాంటిదాని కోసం పదిహేను వందలూ దొంగతనం... (ఆగాడు)

సీ: ఏమిటి? దొంగతన మేమిటి?

కే: ఏం లేదు.

సీ: చెప్పరూ? దొంగతన మేమిటి?

కే: ఏమీా లేదంటే—

సీ : నాతో చెప్పాలి. చాలాభయపడుతున్నారు. దొంగతనమా? పదిహేనువందలా ? చెప్పండి. ఏదో కొంప మునుగుతోంది. నాతో చెప్పకపోతే వీల్లేదు. తరవాత ఏడ్చి లాభంలేదు.

కే : అబ్బా ! నిజమే—నిజమే ! కొంపమీదికే వొచ్చింది. ఎవరితో చెప్పకు. బాంకిలోంచి ఆ డబ్బు తీసి, దాని కిచ్చాను—

సీ : బాంకిలోంచి...చచ్చాము—చచ్చాము. మీ వుద్యోగం పోతుందా ? ఎప్పుడు ? ఎందుకు ?

కే : అబ్బా, అవన్నీ అడక్కు. యిచ్చాను.

సీ : దౌర్భాగ్యురాలు, దొంగది. ఇంతపని చేసింతరువాత, చివ రికి మిమ్మల్ని, మనిషిని తీసుకుంది, చాలదూ! యింకా పైగా మిమ్మల్నిట్లా దివాలాతీయించి, భికారిని చేసి, ఖైదులో పెట్టించ తలుచుకుంది. తప్పదు. మిమ్మల్ని పట్టుకుంటారు. సిగ్గు, అవ మానం, పోనీ నాసంగతి తలుచుకున్నారా ?

కే : తిట్టకు. నేను ద్రోహిని. పాతకిని, ఏం కాను ? నాకు తగిన ప్రాయశ్చిత్త మయింది.

సీ : పోనీండి. మరి యెట్లా తీరుద్దా మనుకున్నారు?

కే : ఏమో- ఎట్లానో-!

సీ : అదే దొంగిలించమందా ?

కే : దానికి తెలీదు. నాదే నని యిచ్చాను.

(సీత యేదో అతని ఆపద తప్పించే పద్ధతి మనసులో వుంచుకొని, ఆతన్ని కొంచం యేడిపించాలనే వుద్దేశ్యంతో మాట్లాడుతోంది)

సీ: సరేలెండి. మరి యిప్పు డేం చేస్తారు ?

కే: ఏంచెయ్యానా అనే ఆలోచిస్తున్నాను.

సీ: యిందాకట్నుంచీ ఆలోచించారుగా, యేమన్నా తోచిందా?

కే: ఏమీతోచలేదు.

సీ: మరి పాపం! మీకు చాలాతంటా వొస్తుందే! పనిపోయి కైదులోకి-

కే: పిచ్చిదానా, భయపడకు. అంతవరకు రానిస్తానా!

సీ: ( Disappoint ఐ) ఏంచేస్తారు ? అంత డబ్బెవరు అప్పిస్తారు ?

కే: అప్పెందుకు? నీనగలు లేవూ?

సీ: నా నగలా! అమ్ముతారా?

కే: బంగారం ధర బాగానే వుంది.

సీ: అవి నావిగా-

కే: అవును. అందుకనే-

సీ: నే నివ్వకపోతే-

కే: ఎందు కివ్వవు? యివ్వ కేం చేస్తావు?

సీ: ఎందు కివ్వా లేం?

కే: ఎందు కేముంది! అవసరం గనక-

సీ: మీరు సొమ్ము దొంగిలించి, మీ ముండ కిచ్చుకుంటే-మరి నేను నా నగలమ్మి-

కే: మరి భార్యకీ, లంజకీ భేద మేమిటి?

సీ: నగలిచ్చేది భార్యా, అనుభవించేది లంజా. అంతే—

కే: మరి కష్టకాలంలో భర్తకి యియ్యకపోతే...యియ్యవా ఏమిటి?

సీ: ఇస్తా లెండి. కాని, యియ్యనంటుం దనుకోండి ఒకత్తె-

కే: యివ్వకపోతే తన్ని లాక్కుంటారు.

సీ: మరి భార్యనిగా—

కే: భార్యే భర్తదైనప్పుడు-

సీ: నే నివ్వకపోతే తంతారా?

కే: ఛా, ను వ్విస్తా వని ముందే తెలునుగా నాకు.

సీ: (ఆలోచనగా Disappointed గా) ముందు తెలునునా? అవును.

కే: ఎందు కా బెంగ?

సీ: ఏంలేదు.

కే: చెప్పాలి...దిగులుపడకు- మళ్ళీ చేయించిపెడతాను. నగల మీాద అంత ప్రేమా? మొగుడికన్నా ఎక్కువా?

సీ: అది కాదు.

కే: ఏమిటి?

సీ: మీరు నానగలు అమ్మడం సంగతి అనుకోరు. ఎట్లానా అని దిగులు పడుతోవుంటారు. అప్పుడు నానగలు యిస్తానంటాను. మీ కెంతో సంతోషం కలుగుతుంది. నాభార్య నా కింత త్యాగంచేసింది కదా అనుకుని, యెంతో ప్రేమిస్తారనుకున్నాను.

కే: పిచ్చిదానా, నా ప్రేమంతా యిదివరకే యిస్తినిగదా, యింక కొత్తగా ప్రేమ యివ్వడ మేమిటి? త్యాగ మేమిటి, నీ మొహం! భార్యా భర్తల్లో: ఐక్యమైన తరవాత. అసలు నగలేక భాగ్యంగా కనపడతాయా, భక్తిముందు!

సీ: నగలమీదప్రేమ లేంది, త్యాగం ఘనత ఏ ముంది?... పోనీలెండి......ఇప్పుడు సంతోషంగా వుందా?

కే: కాని, అది పది హేనువందలూ అన్యాయుంగా కాజేసిందికద! నేనూరు కుంటానా? వెళ్ళి, దాన్ని...

సీ: నే నిస్తున్నానుగా-

కే: కాని, మనకి నష్టమేగా-

సీ: మీ కేం నష్టం? నా కేగా-

కే: నీ కేమిటి: నా కేమిటి? ఈసారి అవసరం వొచ్చినప్పుడు...

సీ: ఎవరికి- మీకా, నాకా?

కే: నీ కేమిటి, నా కేమిటి? మనకి-

సీ: మరి మాతమ్ముడు పరీక్షదరఖాస్తుకి రూపాయ లిమ్మంటే మీ రివ్వక 'వెధవ, చదవకుండా తిరిగి తప్పాడు. వాడికి మళ్ళీ దరఖాస్తుకి డబ్బెందు' కన్నారు.

కే: అంటే ఏం?

సీ: నానాను అమ్మి యిస్తానంటే వల్ల కాదన్నారు. నానగలు- నా అవసరం-

కే: అవును. తెలివి తక్కువగా, వృధాగా, పాడుచేసు కుంటో వుంటే-

సీ: యింత తెలిసైన- (నాలిక కొరుక్కుని) అవును లెండి. మనకి నష్టమే. కాని దాన్ని అనుభవించ నీండి. అది మీ కెంత సంతోషాన్ని యిచ్చింది కాదు! యింతమాత్రం డబ్బు తీసు కుంటే నేం? నాకోసం మీరు ఖర్చు చెయ్యలేదూ, ఎన్ని వేలో! దాన్నే సుఖపడనీండి.

కే: అది వొక్కతే కాదు- అసలు దాని కోసమే కాదు, యీ డబ్బు; ఆ వెధవకోసం తెప్పించి వుంటుది, నాచేత, మోసంచేసి. నాడబ్బు లాగి, పైగా నన్ను వెళ్ళ గొడతాడు! వాణ్ణి- వాణ్ణి- వాడిమీద కసి తీర్చుకుంటాను.

సీ: ఎవ డండీ వాడు? వాడిపే రేమిటి?

కే: ఏమో! శీరి అని పిలుస్తుంది, అది.

సీ: ఎప్పుడూ దాని యింటోనే వుంటాడా?

కే: అట్లాగే కనపడుతోంది. నాకు తెలీకండా ఎన్నాళ్ళనించి దాచుకుందో వాణ్ణి. దాన్ని వొదులుతానా—

సీ: (ఆలోచిస్తోంది) వాడిమీద దానికి అంత యెక్కువైన ప్రేమా?

కే: ఏమో తెలీదు. కాని, వాడు అక్కడ వున్నంతకాలమూ నన్ను చేరనీదు. ప్రేమో, భయమో!

సీ: పోనిండి. వాళ్ళతో మీ కెందుకు? ఆ నీచులతో సహవాస మైనా కష్టమే, విరోధమైనా కష్టమే.

(యిద్దరూ ఆలోచిస్తున్నారు. కేశవరావుకి కన్నీళ్ళువొస్తున్నాయి)

కే: దాన్ని వొదలలేను. దాన్ని చూడకుండా బతకలేను. నీతో చెప్పడానికి సిగ్గేస్తోంది. వుండు వెళ్ళనీ.

సీ: ఎక్కడికి?

కే: అక్కడికే.

సీ: వెళ్ళి...ఏం లాభం?

కే: ఏదో నాగోల నేను పడతాను, బతిమాలతాను, వేడుకుంటాను. అట్లా ప్రాధేయపడితేనైనా నా జాలితలచదూ?

(లేస్తున్నాడు)

సీ: ఛీ, ఛీ, అంత నీచంగా లోబడవ కాకండి, డబ్బు పారేసి కొనుక్కునే భోగందాని కోసం. అందులో ఆ జాతి నీతిలేని

కులటకోసం- నీతిపోతే పోయింది. అభిమానం త్యజించకండి. మీకుకాదు; నాకు న్యూనతగా వుంటుంది.

కే: ఏం చెయ్యను? నిజమే. నన్ను చూస్తే నాకే పరమ అసహ్యం కలుగుతుంది. కాని యీ విరహాన్ని వోర్చుకోలేను. కాలిపోతోంది ప్రతినిమిషమూ. నేను నిలువలేను. ఆ, దాని చూపు- ఆమాటలు- ఎట్లా బతకను, అది లేక ?

సీ: నిజంగా అంత అవసరమా?

కే: అవును- నన్ను ద్వేషించు- నామొహం చూడకు. నాకు సిగ్గులేదు. నీముందర చెప్పేశాను. వెధవని. ఏంచెయ్యను? నావంటి వాణ్ణి యెందుకు కట్టుకున్నావు? (సీతారత్నం ఆలోచిస్తోంది)

సీ: మీ రీరాత్రి వెడితే రానిస్తుందా?

కే: ఏమో-

సీ: వాడు వుంటాడా?

కే: తెలీదు.

సీ: వుంటే-

కే: వాణ్ణి బతిమాలతా, డబ్బిస్తా.

సీ: ఈ రాత్రికి వూరుకోలేరా?

కే: వూరుకుంటే-

సీ: మూడురోజుల్లో- దాన్ని మీ కిప్పిస్తాను.

కే: ఎట్లా?

సీ : ఎట్లానో- అడగకండి.

కే : ఎట్లా ఆగను? ఒక్కసారి వెళ్ళివొస్తా.

సీ : నేను మీ వెంట వొస్తాను.

కే : ఎందుకు?

సీ : వాడు అక్కడ వుంటాడు. మిమ్మ న్నేమన్నా చేస్తాడు.

కే : నువ్వు వొచ్చి ఏంచేస్తావు?

సీ : ఏమో...ఏంచేస్తాను?...మిమ్మన్ని రక్షిస్తాను...దాన్ని బతిమాలతాను...మిమ్మన్ని సంతోషపెట్టుమని ప్రార్థేయ పడతాను. భార్యని నేను వొచ్చి బతిమాలితే నిరాకరించలేదు.

కే : నువ్వా? నాప్రాణంపోయినా, నిన్ను వాళ్ళదగ్గరికి, ఆవీధు లోకి రానిస్తానా?

సీ : ఏమి?

కే : ఛా, నువ్వు...నా భార్యవి అప్రదిష్ట! నీకు మతిపోయిందా!

సీ : నాదైవం, నానాథులు మీరు వెళ్ళగా లేనిది, నేను వెళ్ళ కూడదా? మీకులేని అప్రదిష్ట నా కెట్లా వొస్తుంది! మీప్రతిష్టే నాప్రతిష్ట

కే : ఛీ, ఛీ వీల్లేదు. నువ్వా- నాభార్యవి. అందరూ యేమం టారు?

సీ : నేనిట్లా భద్రంగా, పెట్టెలో విగ్రహంవలె మడిగా వుండా లన్నమాట?

కే : అవును. అక్కడంతా రౌడీలు, తాగుబోతులు.

సీ : నన్నేంచేస్తారు ?

కే : ఏంచేస్తారు ! వెళ్ళు, తెలుస్తుంది.

సీ : ఏంచేస్తారో నా కర్థం కావటంలేదు. వెళ్ళి చూడాలనే వుంది.

కే : చాల్లే, వూరుకో. నేను వెళ్ళి వొస్తాను.

సీ : వెళ్ళరా, నేనూ వొస్తాను.

కే : వీల్లేదు.

సీ : (అతని మోకాళ్ళమీదపడి) నన్నిట్లా వొస్తువువలె చూచుకోకండి. మీ సౌఖ్యాలకే నేనక్కర్రాను. నన్ను మీతో కష్టాలను పంచుకోనీండి. రానీండి- మీసేవ యీగదిలోనే కాదు- లోకంలో, అన్నివేళలా, మీసేవలో ధన్యురాల్ని చెయ్యండి.

కే : అయ్యో! యిట్లాంటి ప్రేమని వొదులుకుని- నా కా దుర్బుద్ధి యేమిటో___యెందు కట్లా తిరుగుతానో !

సీ : దుర్బుద్ధి కాదు. మొగవారు ప్రభువులు. ఆ దర్జా__ఆ ఆనందాలు లేక వుండలేరు. మీ కేం తక్కువ, అనుభవించండి.

కే : ఎంత నీచుణ్ణి ! ఎంత దౌర్భాగ్యుణ్ణి.

సీ : నీచులూ కారు, దౌర్భాగ్యులూ కారు. మీకో ర్కె నా కర్థం కాదు. మీరువుండగా, మీరు వున్నా లేకపోయినా మిమ్మన్ని ప్రేమించింతరువాత యింకోమనిషిని మనసులో నిలపడం నాకెట్లా అసంభవంగా తోస్తుందో అట్లానే నామీద ప్రేమ వుండగా

దాన్ని అంతగా ఎందుకు కోరగలనో నాకర్థంకాదు కాని, మీరు కోరుతున్నారు. బాధపడుతున్నారు. మిమ్మన్ని సంతుష్టి పరుస్తాను. అది మీచేతుల్లో రాలేట్లు చేస్తాను. కాని మీరు వెళ్ళి దానిముందు చవక గాకండి. దానిముందు ప్రాధేయపడకండి-సరేనా?

కే: ఏంచేస్తావు?

సీ: ఏదో-

కే: మోసమా?

సీ: మిమ్మన్ని మోసంచేస్తానా?

కే: దాని కిష్టంకలిగినా, వా డున్నాడు.

సీ: వాడే దాన్ని వొది లేస్తాడు.

కే: అప్పుడు నావిజయం. కాని ఏంచేస్తావు?

సీ: అది నారహస్యం. నామంత్రం.

కే: ఏంమంత్రం?

సీ: అడక్కండి.

కే: చెప్పాలి.

సీ: ఏమి టా అనుమానం!

కే: చెప్పకపోతే నేను వెడతాను.

సీ: అబ్బా! ఏమీలేదు. అదిమహామంత్రం. పతివ్రత లందరూ సేవించినమంత్రం. వారిదర్శించి నే నుపదేశం పొందిన ప్రణవమంత్రం.

కే: అబ్బా! అ దేమిటో చెప్పుదూ, గొడవపెట్టక—

సీ: తరవాత తెలుస్తుంది. తెలిగానే 'అహా! ఏమో ననుకున్నాను. ఏం తెలివి మూర్ఖురా లనుకున్నాను. ఇంత సామర్థ్యముందా నీకు?' అని ఆశ్చర్యపోతారు సామాన్యపు స్త్రీ నంటున్నారు. సామాన్యురాలినే కాని నాహృదయంలో మీమీద వెలిగే భక్తి, నా పాతివ్రత్యం నాకు మహాశక్తి నిస్తోంది. పూర్వపు పతివ్రతల కేట్లాంటి అద్భుతమహిమ కలిగింది? ప్రపంచాన్ని, భూతాల్ని, దేవతల్ని స్వాధీనంచేసుకున్నారు, పాతివ్రత్యంచేత. నేను చూపుతాను, మీకు నాశక్తిని.

కే: కాని ఆ డబ్బు యీలోపల ఖర్చుచేస్తుం దేమో!

సీ: అదీ వొస్తుంది.

— తెర —

# 'త్యాగం'

## నాలుగోరంగం

[వాంరంగో జులతిగవాత. మధ్యాహ్నం రెండుగంటలు. వనకుమారి యిల్లు - గది గూటిదగ్గిర అద్దంలోకి చూస్తూ మంచంమీద శ్రీనివాసులు కూచునివున్నాడు; వెనక వనకుమారి పుస్తకంచదువుతూ దిండుకి ఆనుకుని కూచుంది. ఆపుస్త కంనించి తలెత్తిమాట్లాడుతూ వుంటుంది. శ్రీనివాసులు మీసంకత్తిరించడం, క్రాపు దువ్వడం, స్నో పుయ్యడం యీపనులు చేస్తూ మాట్లాడుతున్నాడు. పుస్తకం చదువుతూ వనకుమారి నవ్వుతోంది|

శ్రీ: ఏమిటి సంగతి?

వ: ఈ పుస్తకమయ్యా! రామప్పంతులూ ఆమంచంకిందే దూరాడు.

శ్రీ: ఎందుకు?

వ: (నవ్వుతో) పూటకూళ్ళమ్మ... చీపురు పట్టుకొచ్చింది.

శ్రీ: ఇద్దరూ మంచంకిందేనే వున్నారా?

వ: ఆ! (చదువుతో నవ్వుతో) అది సరాసరి మంచంకిందికే చూసింది. 'రా బైటికిరా' అంటుంది.

శ్రీ: అదీ, ఆ భోగందీ___

వ: అది యీ తమాషా చూసి ఆనందిస్తోంది.

(వనకుమారి చదువుకుంటోంది, అతను దువ్వుకుంటున్నాడు)

శ్రీ: ఏమన్నా తగిలాయా?

వ: బాగా...యిద్దరికీ.

శ్రీ: దానికీ...

వ: లేదు. (చదువుకుంటోంది.)

శ్రీ: ఎట్లా ఐనా ఆడది తప్పించుకుంటోనే వుంటుంది కాని భోగందానికి తప్పవులే.

వ: (చప్పున చదువు ఆపి) ఏవమ్మా, ఎందుకు తప్పవు? సంసారిదానికి మాత్రం, మొగుడుచూస్తే నరుకుతాడు. ఇంకా భోగందాన్నే వొదులుతాడు గాని—

శ్రీ: ఇద్దర్నీ మంచంకింద దాచిందా? ఏం ఖర్మం చెప్పు?

వ: నీ కేం తెలుసు? అందులో వొకడు బికారి—ఇంకా వాడేడ్చిపోతాడని దయదలిచి—వాణ్ణికూడా చూసింది. హృదయమే పాడుచేస్తుంది వెలయాలిని-అదే బాగుచేస్తుంది సంసారిని.

శ్రీ: వేశ్యకి డబ్బు ప్రధానం లెద్దూ, ఏదన్నా చెప్పు.

వ: సంసారికీ?

శ్రీ: ప్రేమ.

వ: ప్రేమ! ప్రేమే! భర్త ఏడేసే కూడుకీ, గుడ్డకీ. మేమూ, వాళ్ళూ అందరమూ పొట్టకూటికే. అది జన్మమంతా వొక్కడికే, మేము రోజుకి ఒకరికి.

శ్రీ: నీకు సంసారుల సంగతి ఏం తెలుసు? భర్తతో కాపరం ధర్మం. కనక వాళ్ళు పవిత్రులు.

వ: (బాధతో) సరేలే. అంతే ననుకో. నీతో నాకు వాద మెందుకు?

(చదువుకుంటోంది. శ్రీనివాసులు దిద్దుకుంటున్నాడు) ఈయ నెవరోగాని మాసంగతంతా సరిగాచూసి వ్రాశాడయ్యా!

శ్రీ: నువ్వెప్పుడన్నా రామాయణం చదివావా?

వ: లేదు.

శ్రీ: చదవరాదూ?

వ: నా కర్థంకాదు. కాని పురాణం విన్నాను. బయస్కోపులో చూశాను.

శ్రీ: చదవరాదూ! దాంట్లో తెలుస్తుంది స్త్రీ అంటే యెట్లా వుండాలో.

వ: నీకు రామాయణం సంగతెందుకు?

శ్రీ: నాసంగతేం తెలుసు నీకు?

వ: నీ కల్లుదుకాణం, కాఫీహోటలు—నువ్వెక్కడన్నా పురాణం విన్నావా?

శ్రీ: ఇంక కల్లుదుకాణం లేదు-ఏమీలేదు. ఈ మూడురోజులూ తాగానా?

వ: ఏమో...చాలెద్దూ ఆషోకు-ఎందు కంత చెక్కుతున్నావు?

శ్రీ: తాగానా- లేదు. ఇంక తాగను.

వ: ఎంతసి పామాటలు - సాయింత్రిందాకా.
శ్రీ: చూద్దుగాని.
వ: నిజంగానాకోసం, నువ్వునీఅలవాట్లనిమార్చుకుంటున్నావా? ఏది—యే వరం నాకు యీశ్వరి యిస్తుందనుకుంటున్నానో అది సంప్రాప్తమౌతుందా? అంతభాగ్యమా? నువ్వు వొప్పుకో—చాలు. శ్రీ-మనం వెళ్ళిపోదాం-మనం ఈరోజుసాయింత్రం వెళ్ళిపోదాం.
శ్రీ: నేను రాను.
వ: నాకు తెలుసుగా- నువ్వు నీ సావాసాలు వొదలలేవని—
శ్రీ: అందుకు కాదు. నా కోగొప్ప అదృష్టం తటస్థించింది.
వ: ఊ!
శ్రీ: నిజం-
వ: ఏమిటి?
శ్రీ: ఈమూడురోజులూ నేను మారిపోయినట్టులేనూ?
వ: ఏమో నా కేం కనపట్టంలేదు.
శ్రీ: నిర్మలమైన ప్రేమ-
వ: అంటే.
శ్రీ: అదే మొన్న చెప్పలా-
వ: అ దెవతో నీకు వుత్తరం రాశిందని- నీపేరు వినా, లేక నీ కీర్తి వినా?

శ్రీ : ఆ దోవన పోతోంటే నన్ను చూసింది.

వ : ఒక్క చూపుతోనే! చాలా వరిబంధమే! ఆ చూపుతో వెనక్కి మూర్ఛపడ్డది. అప్పుడు చెలికత్తెలు పన్నీరూ, కర్పూరమూ చల్లారు ఎంతకీ లేవదు. అప్పుడు_

శ్రీ : చాలు వుండు.

వ : విను. చెలులు తమతో ఆరహాస్యం చెప్పమని ప్రార్థించగా-

శ్రీ : చాల్లే, వేళాకోళం.

వ : సరేగాని, ని న్నెట్లా కనుక్కుంది ? చిలకని పంపించిందా, హంసని—

శ్రీ : నీ నెత్తిని-

వ : సరే, ఈ మూడురోజులూ అక్కడే నన్నమాట- చెప్పవేం యింకా ? మొగుడున్నాడా ?

శ్రీ : ఆ-

వ : ఎంతవుంది ?

శ్రీ : నోరుముయ్యి.

వ : ఇద్దరు కనపడుతోనే వున్నారు కదా !

శ్రీ : ఛీ, ఛీ, అట్లాంటి మాటలనకు.

వ : ఆయన దర్శన మయిందా ?

శ్రీ : వాడు యీమెని వొదిలి యెక్కడో తిరుగుతో వుంటాడు.

వ : చెప్పుకు వచ్చింది. నీమనసుకరిగింది. అంతేనా ? ఏమన్నా డబ్బు అడిగిందా ?

శ్రీ: (అనుమానంగా) లేదు.

వ: జాగ్రత్త కొంపముంచేట్టుంది.

శ్రీ: ఛా! సాధారణ మనిషికాదు. అతి అమాయకురాలు.

వ: మొదట అట్లానే అంటారు. నటించేకులటలూ, యీవిష యాల్లో అనుభవంగలవాళ్ళూ, యిల్లాంటి మాటలేచెప్పి సుల భంగా నమ్మించి వొలలో వేసుకుంటారు. ఆమాటలే వేశ్య మాట్లాడితే, అబద్ధాలనుకుంటారు- భర్తనొకణ్ణి చాటు వేసు కుని, మాట్లాడగానే అన్నీ పవిత్రవచనా లౌతాయి.

శ్రీ: నువ్వు వొక్కసారి ఆమెనిచూస్తే తెలుస్తుంది. నువ్వు- తాకడంపాపం.

వ: సరే- కానీ, కానీ-

శ్రీ: ఆమెకోసం నే నేమన్నా చేస్తాను. ఆ అమాయకవు పసికళ్ళ లోంచి ఒక్కచూపుచాలు- ఆమె మెత్తని పెదవుల్లోంచి ఒక చిరునవ్వు చాలు. కాదు, యీమూడు రోజుల్లో ఒక్కసారి తాగానా?

వ: లేదు అదేనా భయం. ఆ కళ్ళచ్చేదల్లా ఒక్కచూపే! ఆ దానికోసం, వెర్రివాడివి, నువ్వెంతో త్యాగంచేస్తావు ఎన్నో కలలు కని, ఎంతోకవిత్వ మల్లుతావు- నాకు తెలీదూ. ఆ రామ రాజువారి అమ్మాయితో- కాని ఆడవాళ్ళకి అట్లా తృప్తి కలగదు-

శ్రీ: ఏమీ భయంలేదు...కాని వనం! నేనొకటి అడుగు తాను విను......నీతో వొచ్చేస్తాను, నువ్వెక్కడికి తీసికెళ్ళినా సరే... కాని ఆమ్మాయిని కూడా తీసికెడదాము.

వ: ఎట్లా- అమాంతం ఎత్తుకు వొస్తావా?

శ్రీ: వొచ్చేస్తుంది.

వ: అన్నదా?

శ్రీ: అన్నమాటే!

వ: (ఆలోచిస్తూ) నువ్వేదో పెద్దచిక్కులో తగులు కుంటు న్నావు. నాకు నిజంగా భయంగావుంది.

శ్రీ: ఛా-

వ: ఏమాత్రం విశ్వాసమూ, నీతీ వున్న మనిషైనా మొగుణ్ణి, సంసారాన్నీ వొదిలి వొస్తుందా?

శ్రీ: నామీద ప్రేమచేత-

వ: ఎంత ప్రేమించినా- భర్త నన్యాయం చేసేముండ, ఎవర్ని మాత్రం ఎట్లా ప్రేమిస్తుంది? నామాట విను. అంతామాయ. పిచ్చివాణ్ణి నిన్నాధారం చేసుకుని లేచి వొచ్చి, యెక్కడికో పోవాలని చూస్తోంది. దెబ్బ తినేది నువ్వు. ఆ మొగుడు, బంధు వులు నిన్ను చంపుతారు- కైదులో పెట్టిస్తారు- అది పోతుంది- ఆ దిగులుతో నువ్వు చస్తావు! నామాట విను- వెళ్ళకు. దాని వేవు వెళ్ళకు...శ్రీ...శ్రీ! నామాట వినవూ?

శ్రీ : నీకు తెలీదు. పూరుకో. నా ప్రాణం పోయినా...

వ : అవును. నాకు తెలుసు వెళ్ళక మానవు ఖర్మం...అంతా పురాకృత ఖర్మం...కానీ...

శ్రీ : నన్ను నమ్ము. ను వ్వెంతో సహాయం చేస్తావనుకున్నాను. మరి ఆమెని తీసుకుని యెక్కడికి పోను ?

వ : ఇక్కడికే రా. వొద్దన్నానా ? కాని చిక్కులువడి చచ్చి పోతావు. ఎట్లానూ నాకు దక్కవు.

శ్రీ : ఎప్పుడూ నీతోనే వుంటాను.

వ : మాటలు. మీ పవిత్రురాలు నాదగ్గిర వుండడానికి వొప్పు కుంటుందా ?

శ్రీ : కాని ను వ్వీవృత్తి మానెయ్యాలి.

వ : మానేసి——

శ్రీ : అదుగో - ఎక్కడికో వెడదామన్నావుగా వెళ్ళిపోదాం. దానికి చాలానగ లున్నాయి.

వ : నగలుకూడానా ! కొంపముంచుతున్నావు.

శ్రీ : ఏమీ భయంలేదు. వెళ్ళిపోదాం. నువ్విదంతా ఒదిలెయ్యి.

వ : ఎందుకు ?

శ్రీ : మరి, ఆమె. నిర్మలమైన ఆమె-

వ : నిర్మలమా. నీతో లేచివొచ్చేది.

శ్రీ : నీ కర్థం కాదు.

వ : అవును, అర్థంకాదు. లేచివొచ్చేదానికి నావృత్తి అభ్యంత
రమా ?
శ్రీ : కాని నన్ను ప్రేమించిందికద—
వ : ఐతే—
శ్రీ : మరి, ధనం కోసంనువ్వు ప్రతివాణ్ణీ-
వ : అదా? మరి, శ్రీ! యీధనం సంపాయించడం నీకోసమేగా-
నీమీాది ప్రేమవల్లనేగా! నేనూ మానేస్తే, యెట్లా బతుకుదాం?
రోజూకినువ్వు మూడణాలు సంపాయించు, మానేస్తానన లేదూ?
శ్రీ : కానిడబ్బుకి యీవెధవల్ని-
వ : ఆవెధవలవంటి వాడెవడికాళ్ళో కడిగే భార్యనేగా నువ్వు
పూజిస్తోంది!
శ్రీ : అదంతాపోనీ నే నడిగిందానికి జావాబు చెప్పు-
వ : నీయిష్టం శ్రీ-
శ్రీ : నీమీాదప్రేమ లేదనుకోకు.
వ : నానంగ తెలుదుకులే- దిక్కుమాలిన వేశ్యని.
శ్రీ : ఎంతో ప్రేమ నామీాద. కాని నన్ను తాకనీదు. అట్లా
యిష్టం లేదంటూంది. నన్ను చూస్తుంది. నేను తనదగ్గిర వుండడం
యిష్టమే- అంతే-
వ : ప్రతమా?
శ్రీ : వెక్కిరించకు.
వ : నిజంగా దాన్నంత ప్రేమిస్తున్నావా?

శ్రీ: నాప్రాణమంతటితోనూ.

వ: ఐతే దాన్ని సంతుష్టిపరుచు.

శ్రీ: నే నుంటేనే సంతుష్టి.

వ: మాటలు- అబద్ధాలు- వేషాలు.
నిజమేననుకో, ఆమెశరీరంలేని దేవత కావొచ్చు. నువ్వు మనిషి వేగా!

శ్రీ: కాని, ఆమె పరమపవిత్రురాలు. అట్లాంటి తుచ్ఛమైన కోర్కెలు ఆమెకి లేవు.

వ: మరి నువ్వెందుకు ?

శ్రీ: ఆమెది నిర్మలమైన ప్రేమ, ఆమెచిటికినవేలిని తాకనీదు.

వ: అంతా వేషం! నాకు తెలీవూ ఆవేషాలు ? నీకు ఇంకావురెక్కించి బోల్తా కొట్టించేందుకు! చాలా గొప్ప జాణ.

శ్రీ: నన్నింతగా పిలిచిందా, మళ్ళా ఏంచెయ్యదు వూరికే చూస్తుంది నేనుకావిలించుకోపోతే! 'ఇదిచాలు. ఇట్లాచూడ్డంచాలు. అట్లానే మీప్రేమ కోరింది' అంటుంది.

వ: నువ్వు ఆగివుండగలవా ?

శ్రీ: ఎంత కష్టమని! కాని ఆమెకి కోపం వొస్తుందేమో నని వూరికే కూచుంటూ. మళ్ళీ నన్ను చూసి, చూసి 'అబ్బా! నన్నింత బాధపెడుతున్నా రండీ' అని దగ్గిరకి వొస్తుంది. మళ్ళీ భయపడి తనే దూరంగా వెడుతుంది.

వ: ఆహా! చాలా వ్యవహారంగా వుందే. నామాట విను. అట్లా మొగవాణ్ణి ఆకర్షించి, తిప్పుకుని, తృప్తిపరచని వాళ్ళు ఆడవాళ్ళు కాదు, రాక్షసులు. ఈ కొత్త ప్రపంచంలో కొందరు బైలుదేరుతున్నారు. కొత్తరకం. తమ మానం యిచ్చేసే ధైర్యంలేదు. కాని మనసులో వ్యభిచారం గుణం అణగదు. అందుకని యిట్లా ఆకర్షించి, నెత్తురుపీల్చి, హృదయాన్ని చీల్చి బైటికి పొమ్మంటారు. నామాట విను. యిదో రాక్షసి. యిది నిన్ను చంపుతుంది. రక్తంతాగే భూతం. పోస్తు వెళ్ళకు.

శీ: ఛీ, ఛీ. నీకు తెలీదు. వూరుకో.

వ: డబ్బా అక్కర్లేక, మనిషీ అక్కర్లేక నిన్నెందుకిట్లా ఆడి స్తోం దనుకున్నావు? ఎంత గుంజుకుని కష్టపెట్టి చేసినాసరే, ఒక్కసారి, అమాంతం పట్టుకుని చూపించు, నువ్వు మొగాడివే నని!

శీ: అదికాదుగాని, ఏమన్నా బహుమానం యివ్వాలని వుంది.

వ: ఇయ్యి పోనీ, కేశవరావుగారు నా కియ్యలా ఆ వుంగరం యియ్యి.

(బీరువాతలుపు తెరుస్తూ)

లేదే! రూపాయలూ లేవే! ఏమైనాయి? నిన్న పొద్దున్న-సాయింత్రం చూశాను. దొంగలెవరో వొచ్చారు. తక్కినవన్నీ అట్లానే వున్నాయి. కేశవరావుగారిచ్చిన పట్టుడా, వుంగరమూ,

రూపాయలూ లేవు.....గాజులూ లేవు...వాడే- ఆ కేశవ
రావే- తనిచ్చిన డబ్బూ, నగలూ తీసుకెళ్ళాడు...కాని ఆయన
రాలేదే! శ్రీ నువ్వేవరన్నా గావడం చూశావా ?
శ్రీ : లేదు.
వ : (అతని మొహంవంక చూస్తూ) నువ్వేమీ ఎరుగవూ ?
నిజంచెప్పు. అయ్యో, యెంతసొమ్ము పోయిందో; ఏంచె
య్యను ?... శ్రీ! నీకు తెలుసు నీ విషయం.
శ్రీ : నీ కెట్లా తెలుసు, తెలుసు నని ?
వ : అదుగో, నీమొహం, చూస్తేనే తెలుస్తోంది అదుగోసిగ్గు.
శ్రీ : అవును, నేనే తీశాను.
వ : తీసి దానికిచ్చావు, అవునా ?
శ్రీ : అవును.
వ : నేను చెప్పలా యిది డబ్బుతో వ్యవహారమని!
శ్రీ : చాలా సిగ్గేస్తోంది.
వ : అడిగిందా ?
శ్రీ : డబ్బులేదని, తనభర్త తనసంసారాన్ని గొప్ప ఆపదలోకి
తీసుకొచ్చాడంటే—
వ : నీప్రేమ అబద్ధం కాదని చూపడానికి—
శ్రీ : అవును. యింక ఏమీ అనకు.
వ : నిన్నేమీ అనటంలేదు (మాట్లాడలేక వూరికే చూస్తోంది)

శ్రీ : ఏమీ అనకుండా అల్లాచూడకు. తిట్టు- వెళ్ళకొట్టు- నన్ను తన్ను. నీమాట వింటాగా. మనం వెళ్ళిపోదాం. వెళదామన్నావుగా !

వ : డబ్బేదీ ! పోని డబ్బు కేంగాని, నీమనసు అక్కడ వుందిగా.

శ్రీ : లేదు. వెళ్ళను.

వ : చూడు, ఆమాట లెట్లా అంటాడో ! నువ్వు వెళ్ళకండా వుండేది. పద, కండువా వేసుకో, పో... కదులు... నే నేమీ అనుకోనులే.

శ్రీ : ఇం కెప్పుడూ, యేమీ తీసికెళ్ళను

వ : (నవ్వుతో) తీసుకు వెళ్ళటానికి యేమీ లేదుగా.

శ్రీ : నేను వెళ్ళను.

వ : వెళ్ళవోయ్.

శ్రీ : ఆఖరుసారి, యింక రానని చెప్పి వొచ్చేస్తాను. ఆడబ్బ కూడ అడిగి తెస్తాను.

వ : యిస్తారు ! యిస్తారు ! !

(కండువావేసి పంపుతోంది. అతనువెళ్ళి దేరగానే దిగులుగా ఆలోచిస్తో నుంచుంది.)

శ్రీ : నువ్వెంతచెప్పు వెళ్ళను. వెళ్ళమంటున్నావుగాని నీకు నేను వెళ్ళాలని లేదు.

వ : నాకెందుకు మధ్య ? నువ్వు వెడితేనేం, వెళ్ళకపోతే నేం !

శ్రీ : అట్లా నే, దాన్ని మోహించడం, దాన్నే నేను యింతకోరడం నీకు బాపుచ్ఛేదు- అవునా ?

వ : కాదు. సు వ్వెందరితో తిరుగుతున్నావో - నా కేమన్నా పట్టిందా- కాని-

శ్రీ : తెలిసిందిలే నీకలలు...కలలికి అభ్యంతరం వొస్తోంది. అందుకూ-

వ : నిజమేనేమో ! ఎంతతిరిగినా చివరికి నా చేతుల్లోకి వొస్తావు కదా అని నమ్మకం. ఈసారి, యీవ్యవహారంచూస్తే, యింక నాకు దక్కడేమో ననిపిస్తోంది. ఇతేనా- యీకలా మాయమేనా ? నా జీవితమంతా యీకూపంలో, యీనరకంలో గడవవలిసిందేనా ? యింక యీ జన్మకి ముక్తిలేదా అని దిగులేస్తోంది.

శ్రీ : నన్ను మోసం చేస్తుందిగా- అప్పుడు నీదగ్గిరికే వొస్తాను.

వ : కాని మోసం చేసిందా వెర్రెత్తిపోతావు నువ్వు పదిమంది వంటివాడివి కావు. అంతా, నాడీమల్లే తాగుడు- బడాయిలేగాని, చంటిపిల్లవాడు నయం నీకన్నా, విశ్వాసంలో అమాయ అంతా నిజమనుకుని నమ్మి నలిగిపోతావు, పాపం. (కన్నీళ్ళతో) ఇంక నా శ్రీవికావు- అంతం...అంతా ఆఖరు...ఈనాటితో అంతం...నేనుచేసిన పాపాలు...నేను డబ్బుకోసం ఛేదించిన హృదయాలు- కార్పించిన కన్నీళ్ళు నన్నుకొట్టాయి- నాముక్తి ద్వారం ఒక్కటే మూసుకుంది-నావొక్క కలా మాయమైంది.

శ్రీ: కాని ఒకవేళమనం వెడదామనుకున్నా డబ్బులేనుగా-

వ: అదెంతసేపు- ఈవాళ కేశవరావు రాగానే మళ్ళీలాగు తాను.

శ్రీ: చాలాధనవంతుడా ?

వ: ఆ.

శ్రీ: వొచ్చేస్తాను. వెళ్ళిపోదాం.

వ: పిచ్చివాడా, ఎట్లానూరావు.

శ్రీ: తొరగావొస్తాను- ఏం

వ: (చిరునవ్వుతో). వుత్తదే- మనంప్రేమించనప్పుడు జాలి కూడావుండదు. నీ ప్రియురాలే ఒక్కకన్నీటిచుక్క రాల్చనీ, తహతహలాడిపోతావు నిన్నని లాభంలేదు. మానవస్వభావం. వెళ్ళు.

శ్రీ: తొరగావొస్తాను. ఏం ?

(వెళ్ళాడు. కన్నీళ్ళతో వనకుమారి అట్లానే చూస్తోనుంచుంది. కేశవరావు వొచ్చాడు.)

వ: రండి.

కే: రాకూడదనుకున్నాను. కాని చేతకాలేదు.

వ: చాతకాక ఏవనికీలోబడకూడదు. చెయ్యాలనుకుని నిశ్చయించుకుని చెయ్యాలనిగాని.

కే: మాకేనిగ్రహముంటే మీదగ్గిరికెందుకువొస్తాము.

వ: మేము లేకుండా మీకు జరుగుతుందా? ఈ పతివ్రతలున్నంత వరకు మేముఫుండాలి. కనకనే పతివ్రతలకి విలువ తెక్కువైన దేశం లోనూ, వేశ్యలనేకులాన్ని శాశ్వతంగా ఏర్పాటు చేశారు.

కే: సరేలే- ముందునంగతి యేమిటి?

వ: ఏమిటి?

కే: మరియింతకాలంనన్ను మోసంచేశావే! వాడికోసం నా డబ్బులాగావే.

వ: మిమ్మనేంమోసంచేశాను? వాడికోసంకాదు, నాకోసమే తీసుకున్నాను. నేనుడబ్బు అతనికిస్తే నేననుభవించిందానికన్న యెక్కువత్ప స్తినాను.

కే: అదే, వాడిమీదయెక్కువప్రేమ.

వ: వకవేళ ఔననుకోండి. ఏం?

కే: నాడబ్బంతా లాగి- ప్రేమ వాడికా?

వ: మీడబ్బుతో దేహాన్ని కొంటున్నారుగాని, హృదయాన్ని కొంటున్నారా?

కే: ఆ-

వ: డబ్బుతో యింతవరకు హృదయాన్ని కొన్నారా? కొన గలరా?

కే: మరి ఆ మాటలు, ఆ చూపులు-

వ: నగలూ, చీరెల వంటివి-

కే : ఛీ, యింతే!

వ : దేహానికి స్వేచ్ఛ లేకపోతేనే యింత వుక్కిరిబిక్కిరై పోతామే! యింక హృదయానికికూడా లేకపోతే జీవించ గలమా?

కే : హృదయంతో దేహమూ యిచ్చివుంటావు, అవునా?

వ : అవసరంలేని సంగతు లెందుకూ?

కే : వాణ్ణి వొదిలెయ్యి

వ : నాకోసినా? వీల్లేదు

కే : నువ్వునాకే కావాలి వాడికిప్పుడు రావడానికి వీల్లేదు.

వ : చాలకాదు. మీకు కోపం వొచ్చినా సరే.

కే : వీల్లేదూ? నువ్వు నాదానివి. నేనోర్వను. వాడీసారి యిట్లా వొచ్చాడా చంపుతాను.

వ : సులభం కాదు.

కే : ఏమిటి, నన్ను బెదిరిస్తున్నావా? నిన్ను వొదులుతానా? ఈకంఠంలో ప్రాణముండగా వొదలగలనా? (కావిలించుకు న్నాడు.) రా, పద.

వ : ఏమిటిది? ఇప్పుడు___

కే : ఏమిటా? నోరుమూసుకు పద. ఎవడికోసం?

వ : మరి నాకిస్తాన్న ఐదువందలూ ఏవీ?

కే : పదిహేను వందలేగా నువ్వడిగింది. ఇవ్వాలా?

వ : మీరు నేనడక్కుండానే ఐదువందలెక్క విస్తా నన్నారా, లేదా ?

కే : ఇస్తా నన్నా లే. ఇస్తాగా. పద. నీపని అయింది, పద.

వ : ఆపళ్ళు కొరకడం, ఆకళ్ళెరగి చెయ్యడం ఎందుకు ?

కే : ఎందుకా చెప్తాతాగా (కౌగలించుకొని మెడమీద కొరుకతున్నాడు )

వ : అబ్బా !

కే : అబ్బా ! వాణ్ణి - నన్ను మోసంచేసి- వాణ్ణి- అప్పుడట్టా లేదూ, పద.

వ : ఏమిటి, తాగారా ?

కే : నీరకం. నాకు తెలును నాకు లోబడక యేూమా కావు— నన్నువొదిలి బతకగలవా ? (జుట్టుపట్టుకు లాగుతూ) నాకోసం ఏడుస్తున్నావని తెలుసు. పద...రా...పద.

వ : వుండండీ

కే : వుంటా - వుంటా. నీదుంప తెంచుతా.

వ : ఎందుకంటే...ఇదేమిటి...వుండండి.

కే : ఐతే డబ్బు యిచ్చానన్న మాటే.

వ : కానీండి. మీ యిష్టం.

కే : నాయిష్టమే...నాయిష్టమే...నిన్నిట్లా పీకి, చం......

( తెర )

# త్యాగం.

ఐదో రంగం.

(సీతారత్నం కిటికీలోంచి చూస్తూవుంది. భ్రమరాంబ తలుపుదగ్గిర నుంచుంది- ఆ దేగది- మధ్యాహ్నం-)

భ్రి: ఐతే నేను శ్యామలగారియింటికి వెడతా.

సీ: ఏమిటి రాత్రికి మళ్ళీరావా యేమిటి?

భ్రి: ఏమో! దానివొంట్లో నెమ్మదిగావుండినా అవసరం లేక పోతే వొస్తాను......కాని మరీ ఆరోగ్యవిరాదికి చూస్తే అట్లాకూచుంటావేం? మరీవొస్తోంది. పురాణకథనమునా, అదీ యేమయింది? నాలుగురోజులు అతిథిగ్రంథం చదివింది. మరి యింత చపలచిత్తురాలవేమా అనుకుంటా.

సీ: మూలసూత్రం తెలిసి పోయింతరవాత మరీ అదేపనిగా పుస్తకాలు చదవడ మెందుకు?...సీత- సి అమ్మాయి వెర్రిదనుకు న్నావు. వొట్టిమూర్ఖురాలు, దీనిపెసమిటి దీస్నివొదిలి, భోగం వాళ్ళ వెంటపడ్డాను, దీనికేం తెలుసు ననుకున్నావు. అనుకో అనుకో-

భ్రి: వెర్రిదానివి కాక-

సీ: నేను ఆయనమర్యాదా, ఆయన వుద్యోగం నిలబెట్టాను. మహామాట్లాడతావు

భ్ర : అదేమిటి ?

సీ : ఏంచేశారో తెలుసునా ? బాంకీలో పదిహేనువందలు దొంగిలించి దానికిచ్చారు. మరి అది ఎంతతప్పు! వూరుకుంటా రా యేం ? కనుక్కుంటే ఏమయ్యేవారు ? చెప్పు నీకునాకు. ఆయనికి యెంతఅమర్యాద! కైదు-తెలుసునా-కైదు...ఎక్కడ్నుంచియిస్తారు ? వూరికేచూస్తావేం ? అంతసులభంగా కనపడుతోందానీకు ? నేనేంచేశాను?...ఆ రూపాయిలు దానిదగ్గర్నుంచి తెప్పించి బాంకీలో కట్టించాను.

భ్ర : ఎల్లా ?

సీ : అదే నా రహస్యం. చెప్పను.....మాట్లాడవేం?...ఇంతేనా అనుకుంటున్నావు. నువ్వు చెయ్యి...ఎన్నడన్నా యిట్లాంటి పనిచెయ్యగలవా? వొచ్చిన ఆపదలన్నిటికీ తలవొంచివూరికే ఏడుస్తూకూచున్నావు గానిదానికే నీ కింత గర్వం.

భ్ర : ఆయనికి తెలుసా ?

సీ : ఎందుకు తెలియాలి ? ఏం ? యింకా నాకు ప్రేమంటే, త్యాగమంటే తెలీదంటావా ?

భ్ర : (శ్రీనివాసులు అవతల గదిలోకివొచ్చి తొంగిచూశాడు)

భ్ర : సరే గొప్పదానివేగాని...వీడెవడు, చెప్పు. నేను నిన్న చూశాను. కాని యిదివరకే నేను నిద్రపొయ్యేప్పుడూ, లేచప్పుడూ వొస్తున్నాడా యేమిటి ?

సీ: అంతమాత్రం నమ్మకం లేకపోతే యెట్లా నామీద! పూర్వపు పతివ్రతల్ని యిట్లానే ప్రశ్నించేవారా? వాళ్ళు యిష్టంవొచ్చినవాళ్ళతో మాట్లాడ్డానికి వీలుండేదా, లేదా? భర్తలేనప్పుడు ఋషివొస్తే దాక్కునేవారా, మాట్లాడేవారా? స్త్రీ త్యాగాలు మాత్రం చెయ్యాలి. పురుషుడు అనుమానాలుమాత్రం వొదలకూడదు. చంద్రమతిని అమ్మి హరిశ్చంద్రుడు కాలకౌశికుడి విషయంలో అనుమాన పడ్డాడా?

భ్రి: అనుమాన మేమిటి? జాగ్రత్త: అంతే! రాముడి అనుమానంవల్ల సీత ప్రేమ విరిగిందా!

సీ: ఆ కవికిప్రేమ అర్థంకాలేదు ఏంతెలుసు నీ మొగవాళ్ళకి?

భ్రి: ఆహా! నాకూ, వాల్మీకికీ- యిద్దరికీ బుద్ధులు నేర్పుతున్నావే!

సీ: అవును మరి. పతివ్రత అంటే యేమనుకున్నావు? అనసూయ సూర్యుణ్ణి ఆపిందా, లేదా?

భ్రి: మంచి అనసూయవే! నేను వెళుతున్నాను.

(వెళ్ళింది)

(శ్రీనివాసులు వొచ్చాడు. ఆమెని కావిలించుకోబోయినాడు. ఆమె తప్పించుకుని అతని కూచోపెట్టింది)

సీ: మీకోసం అట్లాఎదురు చూస్తున్నాను.

(పాడుతోంది)

తామరసాక్ష

నీవెపుడు వొస్తావోయని,
తల వాకిలి యిల్లుగ నిలబడి యున్నదిర!
ఏమాట లాడిన నీమాటలేగాని...

(పాడుతూ వుండగా శ్రీనివాసులు ఆమెనిపట్టు కోవాలని ప్రయత్నిస్తాడు; కాని చిక్కక నవ్వుతో, పాడుతో, యిటూ అటూ తిరుగుతుంది.)

వుండండి......వినండి మరి...ఎట్లా కాచుకొని వున్నాను... యెంతో సేపు......ఆపకండి మధ్యలో......బాగా పాడుతూ న్నానా...

(పాడుతోంది)

అట్లా మీకోసం ఎదురుచూస్తూ కూచుని, కూచుని...... అట్లా కూచోండి···అదీ మంచివాళ్ళ లక్షణం .....పొద్దున్నుంచి ఏంచేస్తూన్నారు చెప్పండి.

శ్రీ : ఏమీ లేదు. నిన్ను తలుచుకుంటూ కూచున్నాను.

సీ : ఐతే మరియింత ఆలిస్యమేం ?

శ్రీ: మరి నువ్వు అయిదింటికి రమ్మన్నావు, వొచ్చాను.

సీ : యింతేనా ?

శ్రీ : ఏం ?

సీ : ఇంతేనా తొందరపడి ముందే రావొద్దూ ? శుభ్రంగా భోజనం చేశారా ?

శ్రీ : శుభ్రంగా అంటే- భోజనం చేశాను, ఒకసారి.

సీ : కాఫీ___?

శ్రీ : (సిగ్గుతో) రెండుసార్లు- మామూలే- ఏం ?

సీ : ఏం_ నేనింతవరకు వుపోషం......

శ్రీ : ఎందుకు ?

సీ : మీరు వొస్తారేమో- వొస్తారుకదా, అనుకుంటో వుంటే అన్నం సయిస్తుందా.

శ్రీ : ఐతే ముందు యామన్నా తిను. వెళ్లు - అట్లా కాదు. నువ్విక్కడే వుండు. యామన్నా పట్టుకొస్తా

సీ : అక్కర్లేదు. మీరు రాగానే, మిమ్మల్ని చూడగానే కడుపు నిండి పోయింది. సంపూర్ణమైన బలం వొచ్చింది. (అతని దగ్గిర కూచుంది) బావున్నానా ? చూడండి...ఈజుట్టూ దువ్వు కున్నానో, మీరు చెప్పినట్టేనా...వుండండి మరి.

శ్రీ : (దయగా) నా జీవనమంతా, నా ప్రాణమంతా నీ పాదాలదగ్గిర పారేసి, నీచేతులో పెట్టాను.

సీ : (అతనిమాటల Sincerity కి జాలిపడ్డది.) నన్నెందుకు ప్రేమిస్తారు ? మీవంటి హృదయప్రేమకి తగినదాన్ని కాదు. దుర్మార్గురాలిని. పోనీండి నన్ను.

శ్రీ: నిన్నా పోసిచ్చేది నేను? ఈ లోకాలన్నీ యెదురు తిరిగినా పోనీను.

సీ: (భయంతో) నాలో ఏమీ గొప్పదనం లేదు. సాధారణపు స్త్రీని. ఏదో గొప్ప ప్రేమగాని, సౌఖ్యంగాని వొస్తుందను కోకండి. మిమ్మల్ని పిలిపించాను- చూశాను: కాని మీరు మాత్రం ఆ పెద్ద ఆశలు నిలపకండి. నాకు భయంగావుంది.

శ్రీ: నా బ్రతుకంతా నువ్వే.

సీ: కాను; మీరెక్కడ: నేనెక్కడ! మన లోకాలే వేరు. ఏంలాభం చెప్పండి? ఇది పాపం- యిది అన్యాయం- యిది అక్రమం- ఎన్నటికీ జరిగేవని కాదు.

(ఇద్దరూ ఆలోచించుకుంటున్నారు)

ఐతే ఎందుకు పిలిపించిందా అనుకుంటున్నారు?

శ్రీ: (మాట్లాడలేదు)

సీ: ఆ రూపాయలు తీసుకుంది. దీని అవసరం తీరింది. ఇంక నన్ను వొదుల్చుకోవాలని చూస్తోంది. అనుకుంటున్నారు. పది హేను వందలు లాగింది. ఎంత మోసంరా అనుకుంటున్నారు. అవునా?

శ్రీ: వూరుకో.

సీ: నిజమే చూడండి- అన్యాయంచేశాను మిమ్మల్ని. తీసుకోండి. (మెళ్లోంచి కాసులపేరూ, చంద్రహారం తీసింది) ఇది తీసుకోండి. అంతకన్న ఎక్కువ ఖరీదే! తీసుకోండి. వెళ్ళండి.

ఇంక యీ నిర్భాగ్యురాలి మొహం చూడకండి. సంతోషంగా, కృతజ్ఞతతో యిస్తున్నాను.

శ్రీ: ఇదెందుకు? నువ్వు కావాలి- నీప్రేమ కావాలి.

(ఆమెని గట్టిగా పట్టుకుంటున్నాడు.)

సీ: (మళ్ళీ అల్లరి తెచ్చుకుని) అంత సులభమే! తపస్సు చెయ్యాలి కన్యలకోసం, యుద్ధాలు చెయ్యాలి.

శ్రీ: ఎందుకు నన్నింత బాధపెడతావు? చచ్చిపోతున్నాను. (మళ్ళీ లాక్కున్నాడు.)

సీ: పోనీ యివ్వాదు- నిర్మలంగా, సఖ్యంగా యిట్లా మాటలు చెప్పుకుంటో-

శ్రీ: (కోపంతో) మళ్ళీ ఆమాటలే మాట్లాడుతున్నావు. చూపులతో మాటలతో తృప్తిపడను.

సీ: అంటే—

శ్రీ: అంటే- యిద్దరికీ శరీరాలున్నాయి. మోహముంది.

సీ: వొద్దు. ఈవాల్టికి వొద్దు.

(మాట్లాడకండా ఆమెని ముద్దుపెట్టు కుంటున్నాడు.)

మరి నేను మిమ్మల్ని యిట్లాకోరానా? కబురు పంపాను— వినండి—వుండండి—మోహమున్న దన్నాను—కాని నాకిట్లా— అబ్బా వూరుకుందురూ...లోబడడం యిష్టమన్నానా? ఒక్క సారి...యీమాట...(చప్పున వొదిలించుకుని నవ్వుతోంది.)

ఏం? చిక్కుతానా? ఇంక చిక్కను. (అతనిబాధ చూసి గొంతుమార్చి) మరి యిది తప్పేనా? అది చెప్పండి....... మాట్లాడరేం ..తప్పు: అవునా? నేనింకోరి భార్యానా...

శ్రీ: అట్లా అనుకుంటే నొచ్చేయ్యినాతో ఈనాడు రా... యిప్పుడే... వెళ్ళిపోదాం: రావా? లాక్కుపోతాను– ఈడ్చు కెడతాను. ఎవరడ్డమొస్తారో! రానీ నరుకుతాను. (భయపడుతో చూస్తోంది.) వీళ్లెక్కడ తెచ్చుకున్నానా. అనుకుంటున్నావా? నీకుభయమెందుకు? నీతలమీద వెంట్రుక కదలనిస్తానా? పారి జాత పువ్వుమల్లే చూసుకోనూ? రా, పోదాం, రా.

సీ: (Serious గా) తప్పు. నేనెన్నడూ అట్లాంటి పని చెయ్యను. మీ మీద యెంత ప్రేమ వున్నా అట్లాంటి పాడుపని చెయ్యను.

శ్రీ: (ఆమెని చప్పున పైకితీసుకుని కావిలించుకుని ముద్దుపెట్టు కున్నాడు.)

సీ: వుండండి.

శ్రీ: నేనువుండను. నాఅధికారం. నువ్వుమాట్లాడకు.

సీ: ఐతే నేను మీకు కనపడను. మీరు నన్నిట్లా తాకడం నా కిష్టంలేదు.

శ్రీ: సరే, (మాట్లాడకండా కూచున్నాడు.)

సీ: కోపమా.

శ్రీ: (మాట్లాడడు)

సీ: (అతని మెడమీద చెయ్యేసి) కోపమా? అట్లా కోపగిస్తే నేను బతకగలనా? (అతన్ని బుజ్జగిస్తూ) వొద్దండీ నన్ను తాక కండి. నేను అట్లాకాదు మీ స్నేహాన్ని కోరింది.

శ్రీ: సరే: నీయిష్టం.

సీ: (అతని ముఖంలోకి చూస్తూ) కోపం పోయిందనండి. అం దాకా నేను నిలవలేను. అనండి.

శ్రీ: పోయింది.

సీ: (ఆలోచిస్తూ Cunning గా) నిజంగా నామీద ప్రేమ వుందా?

శ్రీ: (ఆమెని పైకితీసుకుని) అదేప్రశ్న్యత్తరం, అడిగినప్పుడల్లా.
(సీతారత్నం శ్రీనివాసుల్ని నిరాకరించడం మానింది)

సీ: నాపైన తప్పు యెవరిపైనా లేదుకద?

శ్రీ: నిశ్చయంగా లేనే లేదు. ఇంక వేరే రూపానికి స్థలమే లేదు యీ మనసులో.

సీ: మరి ఆ వనకుమారి—

శ్రీ: లేదు.

సీ: మరి దాంతో యెందుకు వుంటారు?

శ్రీ: దాంతోనా? అదోకథ. ప్రస్తుతం యింకవుండే స్థలం లేదు గనక-

సీ: ఆ కథ నాకెందుకుగాని, మరి ఆ సహవాసాలు వొదలి పెట్టరూ? మరి నాకవమానం కాదూ? ఈమాట వినండి.

నేను చాలా మర్యాదస్తురాలిని. మీ ప్రేమకూడా చాలా మర్యాదగా కోరాను. అట్లాంటప్పుడు మీరారా సహవాసం మానెయ్యాలి.

శ్రీ: నామాట విను.

సీ: దాన్ని వొదులుతా నన్ను దాకా మాట్లాడవొద్దు.

శ్రీ: సరే, విను.

సీ: వొదులుతాతా [illegible]

శ్రీ: సరే.

సీ: దాంతో చెప్పిరండి.

శ్రీ: ఏమిటీ ? యిప్పుడే.

సీ: యిప్పుడే.

శ్రీ: నే చెవుతానుగా.

సీ: నేను నమ్మను. మళ్ళీ మెత్తపడతారు వెళ్ళండి.

శ్రీ: నిన్ను వొదిలి యిప్పుడా ?

సీ: తప్పదు.

శ్రీ: పావం. గోలపెట్టదా, నామీద వంచప్రాణాలు పెట్టుకుని.

సీ: పిచ్చి !

శ్రీ: ఏం ?

సీ: బోగంది.

శ్రీ: ఐతేమాత్రం? నీకు తెలీదు దానిసంగతి.

సీ: (పెంకిగా) ఐతె వొదలనంటారా?

శ్రీ: వొదులుతా... మరి వొదిలితే—

సీ: చెప్పండి, దాంతో-

శ్రీ: చెపుతా.

సీ: ఇప్పుడు—

శ్రీ: అంత తొందరేం?

సీ: మరి నన్ను - మీకు ఆ తొందరేం?

శ్రీ: వోసి వెర్రిదానా, యిన్నాళ్ళూ ని అభ్యంతరం యిదా? ముందే చెప్పకూడదూ?... ఈ ఆడవాళ్ళు తమాషా వాళ్ళు... సరే చెపుతాను కాని దాన్ని వొదిలింతరవాత మళ్ళీ అభ్యంతరం పెట్టావా నాసంగ తెరగవు... మంచివాణ్ణి కాదు.

సీ: (భయంతో) వెళ్ళండి.

శ్రీ: పాపం. నామీదే పంచప్రాణాలూ పెట్టుకుంది. ఏడుస్తుంది గావును.

సీ: అంతకష్టమైతె పోనీండి.

శ్రీ: మాయిద్దరికీ యెటువంటి... చూడు, నన్నే, శుద్ధ వెధవని- మురికిలోంచి, రౌడీతనంలోంచి, తాగుడులోంచి రక్షించింది. నేనాధారంగా కలలు కంటోంది-

సీ: పోదురూ- బోగంది- మీరుకాకపోతే యింకోరు-

శ్రీ: నాకు తెలీదు-

సీ: (వినుకుతో) దానిదగ్గిరికే పొండి.

శ్రీ: ఛా, వూరికే ఆలోచించా గాని, ఏ త్యాగంచెయ్య డాని కన్నా జంకుతానా నీకోసం.

సీ: ఏతే మరివెళ్ళి చెప్పిరండి

శ్రీ: యిక్కడే-యిక్కడ కూచుని వుండాలిమరి- వెళ్ళేముందు ఒక్కన్నా [redacted]

సీ: (కఠినంగా) పిల్లేదు.

శ్రీ: పువ్వుమల్లె కనపడతావు ఎంతకఠినత్వం! ఎల్లా ఓర్చుగోను యీ పదినిమిషాలూ? (వెడుతున్నాడు.)

సీ: మాట. (వెనక్కి వొచ్చాడు) యేమంటారు దాంతో?

శ్రీ: ఇంక రానంటాను.

సీ: ఏడి స్త్రీ-

శ్రీ: (అనుమానంగా) ఏంచెయ్యను?

సీ: కరిగిపోరుగద!

శ్రీ: నీ ఆజ్ఞ జ్ఞాపకముండగానే-

సీ: పాపం. మీరురానంటే యెంత యేడుస్తుందో!

శ్రీ: ఏంచేస్తాం?

సీ: మీమీద నిజంగా అంతప్రేమా?

శ్రీ: చాలా.

సీ: మీకూ?

శ్రీ: లేదు.

సీ: అన్యాయం, (మనసు సమాధానపెట్టుకుంటూ) వెళ్ళండి.

శ్రీ: ఎంత లేతహృదయం! దాన్ని సమాధాన పెడతానుగా! నేను ఏడిపిస్తే ఓదార్చేవాళ్ళు పదిమంది వున్నారు.

సీ: ఓదార్చగలరా?

శ్రీ: ఆ.

సీ: నేనదే నమ్మలేదు. ప్రేమకి బదులు ధనం యెట్లా స్వీకరిస్తారో. పాపపుబతుకు- నాదీ అంతే!

శ్రీ: ఛీ, ఛీ, కాదు.

సీ: మిమ్మల్ని యిద్దర్నీ విడతీస్తున్నా.

శ్రీ: నాకు ప్రేమలేందే!

సీ: ఏమిటో- వెళ్ళండి

శ్రీ: మరినేను వొచ్చేప్పటికి యిక్కడే యిట్లానే కూచో. మాట చెప్పేసి వొస్తాను.

సీ: చాలాసేపు, పాపం వొదలలేకపోతే-

శ్రీ: నేను వొస్తానుకదూ-

సీ: తొందరపడకండి యీరాత్రింతా యిక్కడే- మీకోసమే కాచుకుని వుంటాను. (పాడుతోంది)

శ్రీ: నిన్నడబాసి

అరనిమిష మోర్వమర...

(వెళ్ళిపోతున్నాడు. కొంచెంసేపు ఆలోచిస్తో, భయంగా, వంటే హాంలో కూచుని వుంది సీతారత్నం.)

(తెరలోంచి 'ఆ' అని పలికి భ్రమరాంబ వొచ్చింది).

భ్ర: వెళ్ళాడా: ఈవాల్టికి వెళ్ళడనుకున్నా! ఏమిటా రహస్యాలూ? ఐపోయింది కద నలుగురికీ తెలీ లేదు యింకా. రాడుకద- మాట్లాడవేం? ఈసారి వాడు గడప తొక్కాడంటే నే నూరుకోను. ఏమిటా భయం? అట్లా వున్నావేం?

సీ: (ఆలోచనగా) అమ్మా, యిది చెప్పు. ఒకామె. పూర్వపు పతివ్రతేననుకో- భర్తకోసం, ఆయన ఆనందంకోసం, తన మానాన్నికూడా, త్యాగం చెయ్యవలసి వొచ్చిందనుకో-

భ్ర: ఐతే___

సీ: పూర్వపు పతివ్రతలు త్యాగంచేశారు: అవునా?

భ్ర: ఐతే-

సి: అవునా, కాదా?

భ్ర: అవునే, అనుకో. ఐతే___

సీ: ఒకవేళ నాన్న ఆనందానికి నీశీలం త్యాగం చెయ్యడం అవసరమై వుంటే.

భ్ర: నోరు ముయ్యి.

సీ: మరి సీత జంకేదా?

భ్ర: సీతదగ్గరికి వొచ్చేటప్పటికి భస్మంకాడూ వాడు?

సీ: రావణుడే బలం కల రాజై, రాముడిప్రాణం రక్షించడానికి సీత—

భ్రీ: పో, ఇంక మాట్లాడకు. చాలు. రామాయణం చదివించడం నాబుద్ధి పొరపాటయింది.

(కేశవరావు వొచ్చాడు. భ్రీమరాంబ లోపలికి వెళ్ళింది. సీతారత్నం ఆశ్చర్యంతో భయంతో చూస్తోంది.)

సీ: (విసుకుగా) ఎందుకు వొచ్చారు? ఎట్లా వొచ్చారు?

కే: ఏం వొస్తే?

సీ: రానన్నారుగా—

కే: వొచ్చాను

సీ: గుంటూరు వెళ్ళలా?

కే: లేదు.

సీ: ఎక్కడ వున్నారు?

కే: (తడుముకొంటో) ఎక్కడాలేదు ఆఫీసులో—

సీ: మూసేశారుగా—

కే: ఎక్కడో—స్నేహితుడియింట్లో—చీట్లాడుతున్నాను.

సీ: వెళ్ళండి.

కే: ఎక్కడికి?

సీ: ఎక్కడికన్నాను

కే: ఎందుకు?

సీ: తరవాత చెపుతా.

కే: చెప్పాలి.

సీ: నన్ను నమ్మరూ?

కే: నమ్మతా—కాని వెళ్ళడ మెందుకు?

సీ: మరి మీకు దాన్ని యిప్పించవొద్దూ?

కే: (నవ్వుకుంటో) అక్కర్లేదు.

సీ: (ఆశ్చర్యంతో) అక్కర్లేదూ?

కే: ఆహా!

సీ: ఏం?

కే: అవసరంలేదు.

సీ: ఎందుకు లేదు? (దిగులుగా) యింతకష్టపడి, మీకోసం.

కే: పోనీ నాకవసరం లేదన్నాగా.

సీ: సరేలెండి పోనీ. కాని నేను పనిజ్ఞగలదాన్ని అంటారా, లేదా?

కే: కావచ్చును.

సీ: అల్లా అంటే కాదు. మీ రిప్పుడు వెళ్ళి చూడండి.

కే: ఎక్కడికి?

సీ: దానియింటికి.

కే: వెడితే.

సీ: మీకే తెలుస్తుంది. నే నేమీ చేతకాని మూర్ఖురాల్ని అనుకున్నారా. లేదా? నేను సాధిస్తా నన్నానా? ఈగదిలోకూచుని

ఎంతపనిసాధించానో తెస్తుంది. సింహాం, చిట్టిలుకా, కథక్షావక ముందా, వెళ్ళండి.

కే: సరేగాని, యీావేష మేమిటి? ఆ గంధమేమిటి? ఆ చీరె-ఆ పువ్వులూ- పేరంటమా?

సీ: అదేలెండి నాసంగతి. నా అందం మీాకెందుకు?

కే: కాదు. చెప్పు. ఈ అలంకార మేమిటి?

సీ: ఆ దేవతని పుపాసించేందుకు యివన్నీ అవసరం- యీావేషం_

కే: ఏ దేవతని?

సీ: త్యాగదేవతని. పూర్వపు పురాణాల్లో వర్ణించారే. మహా పతివ్రతలందరూ తదేక దీక్షతో పుపాసించారే, ఆ త్యాగమహా దేవతని...

కే: (అనుమానంగా) ఏదే, దేవత యేదే? పూజయేదే.

సీ: హృదయంలో. సరే యింక వెళ్ళాలి. మరిచిపోలేదు. వెళ్ళక పోతే మీాకే నష్టం.

కే: ఏం నష్టం?

సీ: అది దక్కదు.

కే: పోసీ.

సీ: నాకు, నా సామర్థ్యం తెలుకోవాలని వుంది. వెళ్ళి చూానుకు రండి. దాని మనసు మారింది మండండి, నా ప్రభావం.

కే: నీ కప్పుడే ఎట్లా తెలిసింది?

సీ: ఏమిటి?

కే: దాని మనసు మారిందని-

సీ: మారిందా? మీకు తెలుసునా?

కే: నాకేం తెలుసు? యిల్లా రా. ఏమిటీ కొత్త కళ! కొత్త అందం! ఇల్లా రా. ఇక్కడ నువ్వుండగా నేనెక్కడికో వెళ్ళడమెందుకు?

సీ: మీరు మళ్ళీ రాగానే యింకమెంతో మిమ్మల్ని రంజింప చేస్తాను. మరి నేను మీ దాన్నికద, మీమీద యెంతో ప్రేమ కద. మీరు చెప్పినమాటలన్నీ యెన్నిసార్లు విన్నాను? కారణాలు అడిగానా! పోనీ. నన్ను నంతోష పెట్టడానికి వెళ్ళండి.

కే: పో, పిచ్చిపిల్లా. యిల్లా రా. నువ్వు కావాలి నాకు యీ [redacted] నిన్ను ఒక్క నిమిషం వొదలను-

సీ: నన్ను తాకారా, చచ్చిపోతా. శాపం. ఈవాళ నావొంక చూస్తూవున్నారా-

కే: వూరుకో నాతో తమాషా నీకు. (పట్టుకుంటున్నాడు) ఆ శాపమేదో- ఆ పాండురాజు శాపం చూస్తాను కదూ.

సీ: నామీదనమ్మక లేదూ? మీరు యిక్కడేవున్నారా మంత్రించెడిపోతుంది. మళ్ళీ వనకుమారి మీకు కనపడదు.

కే: అక్కడ్లే దన్నాగా—

సీ: అక్కర్లేదు. అన్నీ. అక్కర్లేదు. అబద్ధాలు.

(కేశవరావు మెల్లిగా నవ్వుతున్నాడు.)

మీకెట్లాగో తెలిసింది. అది రమ్మని కబురంపింది అవునా? అవునా? నాకు తెలుసు. అందుకనే యీ ధైర్యం. అవునా? అబద్ధం చెప్పకండి.

కే: అవును. కబురంపింది.

సీ: అందుకునేగా, గుంటూరు వెడతా నన్నారు?

కే: కాదులే—

సీ: ఎందుకీ అబద్ధాలు—

కే: చూశావా మరి—

సీ: మరి నన్ను మెచ్చుకోరేం? ఈ వుపకారాని కన్నా వెళ్ళ వొచ్చునుకద నామాటవిని. నామంత్రం వల్లనే—

కే: ఛా, పిచ్చిపిల్లా. నిన్ను మెచ్చుకోడ మొందుకు? దానికి బుద్ధిపుట్టి అది పిలిస్తే—

సీ: ఆ, బుద్ధిపుట్టింది. నేను సాయం చెయ్యపోతే—

కే: నీ మొహం—

సీ: ఎట్లా చెప్పను? మీకే తెలుస్తుంది లెండి.

కే: వాడు పోయినాడు. నన్ను పిలిపించుకుంది. వాడికిం కివత్తో దొరికిం దట!

సీ: అంతేనా! నాప్రయత్న మేమీ లేకుండా యివన్నీ-

కే: సరేలే! నీ ప్రభావమే ననుకో. పోయిం దేముంది. (తలుచుకుంటో) నిర్భాగ్యపు వెధవ- యేదరిద్రపు ముండనో-

సి: దరిద్రపు ముండ యెందుకు కావాలి ?

కే: అంతకంటె వాడి కెవత్తె దొరికివుంటుంది ? వాణ్ణి పిలిపించుకునేటంత దిక్కుమాలింది యెవతె వుంటుంది ?

సి: అంతే నన్నారు—

కే: దాన్ని యీవాళ—దాన్ని—యేంచేశాననుకున్నావు ? నన్నావాళ చేసిందానికి ప్రతిఫలంగా—ప్రాయశ్చిత్తంగా—మెల్లిగా పక్కలో చేరినట్టుచేరి, గొంతుపిసికాను, చచ్చేట్టు గిల్లాను—కొరికాను—రక్తంపరదలు—పాడుముండ—డబ్బిచ్చేదీ—మోహమనేదీ—రక్తంకార్చేదీ—కాని గుడ్లెళ్ళాపెట్టుకు చూస్తుంది. యాభై రూపాయిలనోటు మీదపారేశాను. నోరు మూసుకుంది డబ్బుకి గడ్డితింటారీవేశ్యలు, వొచ్చేప్పుడు దాన్ని డొక్కలో తన్ని తన్ని—కాని యేమన్నా, చూస్తూ వూరుకుంది. అదివాది, నా ముండ, నన్ను వెళ్ళగొట్టేస్తుందా ? ప్రేమో, ద్వేషమో ? ఏమిటో దానిమీద—కాదు... వొదల్లేను—భరించలేను—ఏం చెయ్యను ?

అట్లా చూస్తున్నావేమిటి ? ఏమిటా భయం ? బెదురుతోవుంటే నీకళ్ళు—ఈరోజు మళ్ళీ చిన్నప్పుడు నిన్నుచూసినట్టుంది—ఆ రోజు బావిదగ్గర స్నానంచేసి, నుంచుని వున్నావు. నేను వొచ్చాను. ఎవరన్నా వొస్తారని భయం—కాంక్షముందీ—అట్లావుందీనాడు—రా, వుండు యివన్నీ విప్పేసివొస్తాను.

(చీకటిపడుతోంది. కేశవరావు గదివెనక చీకట్లోకివెళ్ళి కోటు విప్పుతున్నాడు. సీతారాం భయంతో చూస్తూ నుంచుని వుంది. చప్పుడు కాకండావొచ్చి, శ్రీనివాసులు ఆమెని చప్పున కావిలించుకుని మెల్లిగా నవ్వుతున్నాడు. చప్పుడు కాకండా వొదిలించుకోడానికి సీతారాం ప్రయత్నిస్తోంది. దీపం వెలిగించి కేశవరావు వాళ్ళవేపు తిరిగి చూశాడు. రెండు నిమషాలు నోటమాట రాలేదు.)

కే: ఏమిటి? ఇదేమిటి వీడెల్లావొచ్చా డిక్కడికి? అదేమిట్రా, వెధవా? ఏం పనిరా? నాకళ్ళముందే- (శ్రీనివాసులు సీతారాంని వొదిలాడు.)

శ్రీ: వాడెవడిక్కడ? ఈమూలనక్కాడు. ఎవడివిరా నువ్వు? ఇక్కడకూడా దాపరించావా? నీకిక్కడేంపని. యీ దివ్యస్వర్గంలో? ఒకసారి తన్నినా బుద్ధిలేదూ? నావ్యవహారాల్లో నీకు జోక్యమెందుకు? ఏం, చావు ఆశించావా? పో ముందు- నడు- ఇట్లావద- సీతా, వీడిక్కడ దాక్కున్నాడుగావును. మనకితెలీ-

కే: సీతా! సీతేమిటి? (సీతతో) వాడెవడు? ఎందుకు వొచ్చాడు.

శ్రీ: (సీతతో) సీతా, ద్రోహమే- ద్రోహమే- వీడు కూడా నామల్లె...వీడ్ని కూడానా- నీమాటలు, నీ చూపులు అన్నీ...

కే: ఓసి లంజముండా! ఇదా నీ కుట్ర...ఇదా...ఇందుకా నన్ను వెళ్ళమంటున్నావు?

శ్రీ : ఆ, ఆ, ఏమన్నావు, ఆమెని, ఆ పవిత్రురాలిని-నీ నాలుక చీలుస్తా. ఇంక పూరుకోను.

(కేశవరావుని కొడుతున్నాడు. సీత అడ్డం వొచ్చింది.)

కే : (దెబ్బలు తింటోనే) ఇదిటే నీ త్యాగం- నీ త్యాగం! చచ్చావే- నాచేతుల్లో చచ్చావే-

సీ : తిట్టకండి, వృధాగా.

శ్రీ : (కేశవరావుతో) నువ్వు బతికితే కద. (తంతున్నాడు) నువ్వు వుండమ్మా వీడితో నేమిటి : కాని నన్నెంత అన్యాయం, మోసం...

కొట్టరా, నన్ను- ఎదురు తిరగలేని అశక్తవతీ, పోరా......

(బైటికి కీడుస్తున్నాడు. కేశవరావు వొదిలించుకుంటో)

కే : చచ్చావే- నాచేతులో హత్య జరిగిందే యీవాళ- వీణ్ణి, యీ వెధవని-

.శ్రీ ఈమెని తాకావా, చంపేస్తా-పో, యీవేవు వొచ్చావా...

సీతా, సీతా, యింతేనా ? వీడెవడ నీకు ? పొమ్మను.

సీ : (శ్రీ తో) అట్లా అనుకోకండి- నేనట్లాంటిదాన్ని కాను-యీయన...

కే : నా కళ్ళముందే—— ఓసి లంజా—— నేను వింటోండగానే ఆ మాటలు-

శ్రీ : సీతా, నాహృదయం బద్దలుచేస్తున్నావు. వీడు- వీడెవడో దెయ్యం- అబద్ధం- నీమీద వృధాగా అధికారం చలాయిస్తు

న్నాడు. నువ్వు అడ్డంరాకు- పచ్చడి చెయ్యనీ వీణ్ణి- ఒక్కే, యింకో మాట అన్నావా-

సీ : ఈయనా...యీయన- ఎవరా ? నే నీయన పాదాలకింద ధూళిని- ఈయన నాదైవం_ నా...

శ్రీ : వీడా___వనం యింటిముందటి కుక్క___నీచపు వెధవ___ వీడు నీకు దైవమేమిటి ? ఏమన్నా దొంగవేషాలు వేసి-

సీ : ఏమైతేనేం ? ఎటువంటి వాడైతేనేం ? ఆయనే నాభర్త !

శ్రీ : (ఆశ్చర్యంతో) భర్తా ! నీ భర్తా !

కే: సిగ్గులేక చెప్పుకుంటావేం, నేనో భర్తనని! ఎందరో భర్తలు నీకు___(సీతారత్నం చిరునవ్వు నవ్వుతోంది.)

శ్రీ : భర్త...నీ భర్తా యితను ? వీడేనా నీభర్త ?

కే : (సీతారత్నంతో) నవ్వు...నవ్వు నీకు ! జుట్టుపట్టుకుని, చెప్పుతీసుకు___

శ్రీ : పో, వనం గుమ్మందగ్గిర పడియోడు. ఈమె-యీ పతివ్రత- దివ్యమూర్తి-ప్రేమరాణి - యీ పవిత్రాలయు-నీకెందు కీమె ? పో, పో-

కే : నీకెందుకురా ?

శ్రీ : ఈమె నాది. ప్రేమవల్ల నాది ఆమె హృదయం నాది. నేనే ఆమె భర్తని.

సీ : ఏమిటా మాటలు మతిపోయిందా ?

(కేశవరావుతో) ఆయనతో నేమిటిలెండి.

కే: వాడిచాత నన్నుతన్నించి పైగా, ఆయనతో నేమిటిలెండి యేమిటే, నీమొహం తగలపడా!

సీ: మరి ఆయనజోలి కెందుకు వెళ్ళారు: అంతసన్నగా వున్నారేగాని ఆయన బలం మీకేం తెలుసు:

కే: నీకు తెలుసుటే.—ఎట్లా తెలుసునే, నీకు—సిగ్గులేని పీడ ముండా, నిన్ను, నీ నాలిక చీల్చి—

శ్రీ: నోరు ముయ్యి. యింక ఒక్కమాట మిగిలావా పళ్ళు రాల తంతాను ఆమె పాదధూళిని నెత్తిన వేసుకునేందుకు పనికి వొస్తావా?...రా సీతా, వాడితో నేమిటె? ఈగోలంతా మన కెందుకు? వెడదాం రా.

కే: ఏమిటీ వాగుడు? ఈ మాటు సీతా, గీతా. అను చెవుతాను. ఎవరను కున్నావురా? మర్యాదస్తుల యిల్లను కున్నావా భోగం యిల్లనుకున్నావా? ఏమిటి? నీతో లేచివొస్తుందీ... ఏమే లేచిపోతావుటే? ఎట్లా వొస్తుంది? [illegible]టికి కదలమను. యిద్దరికీ మొహాలు వాచేట్లా చెప్పుతీసుకు కొట్టేస్తాను. ఇదేం విపరీతం? వీడెవడో వొచ్చి దీన్ని, అమాంతం లేచిరా అంటాడేమిటి?

(సీత ఆశ్చర్యంతో చూస్తోంది.)

శ్రీ: వాడికీ, వాడి బెదరింపుల కేం? పోదాం.

సీ: వినండి—

శ్రీ: వినడం లేదు, యేం లేదు, రా. (చెయ్యి పట్టుకున్నాడు.)
కే: వొదులు-
సీ: చూడండి.
శ్రీ: దూరంగా నుంచో-
కే: వొదులు- దాని చెయ్యి వొదులు-
శ్రీ: నా చెయ్యి- నా సీత-
కే: ఏది- మళ్ళీ అను- ఎల్లాగరా నీది?
శ్రీ: నాది- నాది- నాది. యింకా అరవనా ఆ కిటికీలోంచి.
కే: ఒరేయ్____
సీ: ఎందుకు యిద్దరూ అల్లా పోట్లాడతారు?
కే: ముందు వొదులు.
(సీతారత్నం చెయ్యి వొదిలించుకుంది. శ్రీనివాసులు మళ్ళీ చెయ్యిజాస్తున్నాడు.)
సీ: వుండండి ఎందు కల్లా పోట్లాడతారు? ఏమిటిది?
(కేశవరావుతో) ఆయనేమంటేనేం. మీభార్యని, మీ దాసిని- మిమ్మల్ని విడిచి యెందుకు వెళతాను నేను?
కే: మరి వాడట్లా అంటాడేం?
సీ: శ్రీనివాసులుగారూ, మీరువూరుకోండి.
కే: అసలు వాడితో నీకు మాటలేమిటి?
శ్రీ: మరి నా దానివి, నాతో రావూ?
సీ: మీదానాన్నా! ఆయన భార్యని-

కే: వాడిచాత నన్నుతన్నించి పైగా, ఆయనతో నేమిటిలెండి యేమిటే, నీమొహం తగలపడా!

సీ: మరి ఆయనజోలి కెందుకు వెళ్ళారు: అంతసన్నగా వున్నారేగాని ఆయన బలం మీాకేం తెలుసు:

కే: నీకు తెలుసుటే—ఎల్లాతెలుసునే, నీకూ—సిగ్గులేని పీడ ముండా, నిన్ను, నీ నాలిక చీల్చి—

శ్రీ: నోరు ముయ్యి. యింక ఒక్కమాట మిగిలావా పళ్ళు రాలతంతాను ఆమె పాదధూళిని నెత్తిన వేసుకునేందుకు పనికి వొస్తావా?...రా సీతా, వాడితో నేమిటె? ఈగోలంతా మన కెందుకు? వెడదాం రా-

కే: ఏమిటీ వాగుడు? ఈ మాటు సీతా, గీతా- అను చెవు తాను. ఎవరను కున్నావురా? మర్యాదస్థుల యిల్లను కున్నావా భోగం యిల్లనుకున్నావా? ఏమిటి? నీతో లేచివొస్తుందీ... ఏమే లేచిపోతావుటే? ఎల్లా వొస్తుంది? పైటికి కదలమను. యిద్దరికీ మొహాలు వాచేట్లు చెప్పుతీసుకు కొట్టిస్తాను. ఇదేం విపరీతం? వీడివడో వొచ్చి దీన్ని, అమాంతం లేచిరా అంటా డేమిటి?

(సీత ఆశ్చర్యంతో చూస్తోంది.)

శ్రీ: వాడికీ, వాడి బెదరింపుల కేం? పోదాం.

సీ: వినండి—

శ్రీ: వినడం లేదు, యేం లేదు, రా. (చెయ్యి పట్టుకున్నాడు.)
కే: వొదులు-
సీ: చూడండి.
శ్రీ: దూరంగా నుంచో-
కే: వొదులు- దాని చెయ్యి వొదులు-
శ్రీ: నా చెయ్యి- నా సీత-
కే: ఏది- మళ్ళీ అను- ఎట్లాగా సీది?
శ్రీ: నాది- నాది- నాది. యింకా అరవనా ఆ కిటికీలోంచి.
కే: ఒరేయ్___
సీ: ఎందుకు యిద్దరూ అట్లా పోట్లాడతారు?
కే: ముందు వొదులు.
(సీతారత్నం చెయ్యి వొదిలించుకుంది. శ్రీనివాసులు మళ్ళీ చెయ్యిజాస్తున్నాడు.)
సీ: వుండండి ఎందు కట్లా పోట్లాడతారు? ఏమిటిది?
(కేశవరావుతో) ఆయనేమంటేనేం. మీ భార్యని, మీ దాసిని-
మిమ్మల్ని విడిచి యెందుకు వెళతాను నేను?
కే: మరి వాడట్లా అంటాడేం?
సీ: శ్రీనివాసులుగారూ, మీరువూరుకోండి.
కే: అసలు వాడితో నీకు మాట లేమిటి?
శ్రీ: మరి నా దానివి, నాతో రావూ?
సీ: మీ దాన్నా! ఆయన భార్యని-

కే: అమ్మో, వెళ్ళటం లేదుకద! ఎంతభయపడ్డాను? కొంప తీసేశా వనుకున్నాను.

సీ: ఎందుకు వెడతాను?

శ్రీ: మరి నా మీద ప్రేమలేదా?

సీ: (ఫ్రూరుకుంది)

కే: ప్రేమేమిటి, నా మొహం? అసలు వీడెందుకు వొచ్చాడు.

శ్రీ: సీతా మాట్లాడవేం?

కే: అదుగో, సీతా మళ్ళీ, పో, యింకపో: వొదిలి...

శ్రీ: అబ్బా, కొంచంసేపు గోలచెయ్యక ఫ్రూరుకో, నేను మాట్లాడాలి.

కే: ఏమిటీ, యిదా, ఈ పీడనెక్కడ సంపాయించావు?

శ్రీ: సీతా మాట్లాడవేం?

సీ: ఏం మాట్లాడను? నన్ను క్షమించాలి మీరు. కాని ఎల్లా క్షమార్పణ అడగాలో నాకు తెలీటంలేదు. నాలుక రావడంలేదు.

కే: క్షమార్ప ణేమిటే?

శ్రీ: (విచారంతో) మారిపోయినావు. అయిపోయిందా? నేన న్నట్టే-నేనుభయపడ్డట్టే...

సీ: (హృదయంకదలి) అయ్యో, యెట్లా చెప్పాలో తెలీటం లేదు. నేను మారలేదు-కాదు-నాహృదయం...అదికాదండీ... ఏమిటో-నేను దుర్మార్గురాలినికాను. మోసంచేసే మనిషిని కాను.

కే: ఏమిటే, ఆమాటలన్నీ నీకేమన్నా మఱిపోయిందా? పద-లోపలికి పదా ముందు.

శ్రీ: ఎందుకు? ఎందుకు పూరావు? వీడిభయంవల్ల కాదుకద (సీత మాట్లాడదు) మాట్లాడు.

కే: అదేమిటో తొంగాయేస్చి యీ పిశాచాన్ని పంపవే! నాభయం వల్లటే నువ్వు వీడిని-

సీ: (కష్టంగా) భయంవల్లకాదు-భక్తివల్ల కాదేమో-భయమే నేమో కాని ఆయనే నా దైవం-ఆయనే నా లోకం...

శ్రీ: వాణ్ణిచూసి భయపడుతున్నావు నిన్నెక్కణ్ణించి తీసుకుపోతేనేకాని-

సీ: ఈయనపాదాన్ని విడిచి నే నెక్కడికి పోస్తాను? అట్టంటి మాటలు మాట్లాడకండి.

శ్రీ: నిజమా! మరి ఆ ప్రేమ- ఆ ముద్దులు...

సీ: అంతా, అంతా త్యాగం!

కే: ముద్దులేమిటే? ఒసే ప్రాణాలునములక తొంగాయేడవ్వే. ఏంచేశావే?

సీ: నేనేమీ చెయ్యలేదు నా హృదయం, నా ప్రాణం, అన్నీ మీవే. ఎన్నటికీ మీ...

కే: పో, పో: నీ దొంగమాటలూ, నువ్వూ. నీ హృదయం-నీదరిద్రం- పో, పో-

శ్రీ : ఇదివరకటిదంతా నటనేనా ? కలా ? మాయా ? అన్యాయం ! అన్యాయం !

సీ : అవును మరిచిపొండి.

శ్రీ : మోసం చేశావా ? ఎందుకు—డబ్బుకోసమే ?

సీ : కాదు. నమ్మండి.

శ్రీ : ఇంక యింతేనా ?

సీ : ఆయన భార్యని, ఆయన ఆజ్ఞానుబద్ధురాలిని. నాకు వేరు మనసులేదు. ఆలోచన లేదు. హృదయం లేదు.

శ్రీ : మోసం చేశావా ? నా హృదయాన్ని నిర్దయగా చీల్చావా ? నీ ఆటకోసం- కాని- ఎందుకు...ఎందుకు...

సీ : క్షమించండి.

శ్రీ : నేను బతికిలేను. తోక్కావు—చితక తొక్కావు— నా హృదయాన్ని...

సీ : మీరింత విచారపడితే నేను భరించలేను. లోకం చాలా విశాలమయింది. ఈ క్షుద్రురాలిని మరిచిపొండి

శ్రీ : నిజంగా, వాడిభయంవల్ల మాట్లాటంలేదు కద ! అట్లా ఐతే వాడి సంగతి- నీముందరే-

సీ : కాదు ఆయన్నేం చెయ్యకండి, నాకోసం—

శ్రీ : ఆ నటన అంతా...

సీ : ఆయనకోసమే !

శ్రీ : జాలి. శ్రీరామా- జాలి. (సీత మాట్లాడదు.)

శ్రీ : శెలవు...

సీ : జాలీలేదు. నిర్భాగ్యురాల్ని. (శ్రీనివాసులు వెళుతు న్నాడు.) యేమండీ ! (ఆగాడు) వెళ్ళకండి. మాట్లాడండి.

శ్రీ : ఎందుకు ?

సీ : మాట్లాడతాను- మీతో స్నేహంగా మాట్లాడతాను.

కే : మాట్లాడతావా ? ఆమాట నాముందే? మాట్లాడు-నేను కలు విరగతంతాను-

సీ : స్నేహానికి కేముంది ?

కే : స్నేహమా? ఆ రాస్కెల్ వెధవతో నీకు స్నేహమా?

సీ : ఏమిటి ?

కే : ఆహా- చాలవరకొచ్చిందా ? ఏమో చెప్పనా ? (చెంపమీద వేశాడు.)

సీ : (శ్రీనివాసులుతో) వెళ్ళండి. నా మనసు మీ మీదనే, యెప్పుడు ..మీ క్షేమం కోసంమే...కృతజ్ఞతో...

కే : ఏమిటి ? నీమనసు వాడిలో...ఒసి రంకుముండా. (జుట్టు పట్టుకుని తంతున్నాడు శ్రీనివాసులు కోపంతో చూస్తు న్నాడు. కేశవరావు వొదిలాడు. శ్రీనివాసులు వెళ్ళాడు.)

సీ : (విచారంతో) పాపం. పాపం...ఎంత అన్యాయంచేశానో! గుడ్డిదాన్నైనను-ఆలోచించాను కాని-పాపం !

కే : కాని చెప్పు. వీడెట్లా వొచ్చాడు.

సీ : పాపం, నేను పిలిపించి-వొప్పించి, నమ్మించి-న్యాయమేనా, నేనుచేసిన పని న్యాయమేనా-

శే : ఏమిటే-పిలిపించి, నమ్మించి, ముద్దుపెట్టించి, పడుకో పెట్టించి-యింకా యేంచేశావు, లవ్వాడుముండా-నిన్ను నిలువునా నరికినా—(కొడుతున్నాడు)

సీ : అన్యాయంగా కొడుతున్నారు. వినండి నిజంతెలిసి మీరే దుఃఖపడతారు.

(శ్రీనివాసులు వొచ్చాడు.)

శ్రీ : అయ్యో సీతా, యిట్లా, నాకళ్ళముందు నీకు అట్లా దెబ్బలు తగులుతోవుంటే, యీ పాపిష్టికళ్ళు చూడవలసివొచ్చిందా! ఒక్కమాట అను-ఆనరహంతకుణ్ణి, నీకళ్ళముందే-వెమిక వెమికకీ సంబంధం లేకండా—

సీ : వొద్దు...ఆయనకి పెలీక కోపంలో...పోనీండి...మీరెం దుకు వెళ్ళండి. నాఖర్మం.

శ్రీ : ఒక్కమాట అడగడానికి వొచ్చాను. నిజంగా నువ్వు నన్ను ప్రేమించనేలేదా? నమ్మలేకండా వున్నాను.

సీ : ప్రేమించాను- కాని. అట్లాకాదు.

శ్రీ : మరి నేను వసంతో ఆమాటచెప్పవొస్తే...

సీ : ఏమో! చెప్పలేను-

శ్రీ : మరి వాగ్దత్తం నిలుపుకునేదానివేనా-



ఐదో

కే : ఏమిటావాగ్దత్తం?

శ్రీ : (కేశవరావుతో) నేనుచాలా తెగించివున్నాను నువ్వు మాట్లాడావా, నిన్నేంచేస్తానో తెలీదు. ఫూరుకో. ఈసారి నోరె త్తావంటె (కేశవరావు భయంతో వూరుకున్నాడు). మరి వాగ్దత్తం.

సీ : నిలువుకునేదాన్నే.

శ్రీ : మరి-

సీ : అవసరంలేకపోయిందికూడాను. వీల్లేకపోయింది.

శ్రీ : నిజంచెప్పు- కడసారి నిన్ను చూడడం- నీకేమాత్రమూ యిష్టంలేదా ? (సీత మాట్లాడదు) చెప్పాలి.

సీ : ఏమో_

శ్రీ: చెప్పాలి. నేను వెళ్ళిపోతున్నాను. నీకేమీ శ్రమయివ్వను.

సీ : పాతివ్రత్యం_ మనసులోగాని- వాక్కులోగాని, ఆయన పాదపద్మాలుగాక-

శ్రీ : మరి యింది-

సీ : త్యాగం- ఆయన కోసమే !

శ్రీ : నీయిష్టం యేమిటి ?

సీ : ఏమో- ఆయన యిష్టమే నాయిష్టం. మీతో మాట్లాడ వొద్దంటున్నారు.

శ్రీ : వాడికోసమా ? ఆ, వనంకోసం వీడు పన్నిన వన్నా గమా ? దానికోసం నువ్వు నన్ను బలికి తీసుకున్నావా? వీడే...

చివరికి వీడె జయించాడు. ఒరే! యిల్లాంటివాడివా? పెళ్ళాన్నమ్ముకునేవాడివా నువ్వు? చూసుకో. ఈసంగతి లోకమంతా చాటిస్తా...... సీతా, చంపావు నన్ను. త్యాగం చేశావా... నాపాణాన్ని!

సీ: మిమ్మన్ని కాదు: నన్ను-

శ్రీ: నిన్నా: పైగా-

సీ: మీమీద ప్రేమవుంది. ముందు నన్ను త్యాగం చేసుకుని-

(వెడుతున్నాడు.)

కే: ఏమిటే- ఆ సమాచారమేమిటో యీడవ్వేం?

(సీతారత్నం అతనిమాటలు వినడంలేదు. Strain భరించలేక వూగుతోంది)

సీ: నాహృదయం చీలినా, మండిపోయినా, లెఖ్ఖచెయ్యక, నిగ్రహించి, క్రూరంగా, కఠినంగా, వంపాను జయించాను- జయించాను. ఆశీర్వదించండి.

కే: నీకేం, పూర్తిగా మతిపోయిందా?

సీ: పాపం- పాపం- ఆ జాలికళ్ళు- మరవగలనా- ఎన్నాళ్ళకైనా మరవగలనా?

కే: ఇదో దొంగవేషం- చెపుతావా, తన్ననా?

సీ: అన్యాయమేనా,...ఘోరమైన అన్యాయం చేశాను. కాని యీశ్వరుడు, దేవి- సీతాదేవి యెరగదా, నా వుద్దేశ్యం, నాబాధ...

కే: సీతాదేవియెవరు ?

సీ: క్షమించగలరా, మీరైనా.....ఆయనయెడల నేను చేసిన యీదారుణమైన అన్యాయం... మళ్ళీవొస్తే బావుండును- ఈపాపపరిహారంగా...

కే: ఏమిటానంగతి, ఏము

సీ: (మాట్లాడదు. తనధ్యానంలోనే వుంటుంది).

కే: నీకు తెలుస్తోందా, నువ్వు చేసినపని.....నిజమేనా___వాడన్నమాటలన్నీ నిజమేనా?

సీ: అవును- అంతా నిజమే నా ప్రాణంకన్న, నాఅభిమానంకన్న ఆయన శ్లాఘకన్న, మిమ్మన్నెక్కువగా ప్రేమించాలని చూశాను

కే: ఊరికే, అవసరంలేని వాగుడంతా వాగకు. ప్రేమట ..

సీ: నానాథులు, నాజీవన-

కే: ఏంచేశావే, నిర్భాగ్యురాలా?

సీ: మీసేవచేశాను- మీ పాదసేవచేశ.

కే: ఏమిటి? ఈనాటకం- ఇదేదో వేషంవేసి తప్పించుకోవాలని చూస్తున్నావా ఏమిటి-

సీ: పాపం. ఎంతబాధపడుతున్నారో! ఏంచెయ్యను మీకోసం?

కే: నోరుముయ్యి. దొంగమాటలు మాట్లాడకు.

సీ: లోకం యేమనుకుంటే మనకేం ?

కే: మనమేమిటి? నేనెవరు, నువ్వెవరు? ఇంకా మనంయేమిటి?

సీ: అవును. నేనెవరు- మీరెవరు, ఒకరికొకరు అర్థంచేసుకో లోనివాళ్ళం, నేనెవరు, మీరెవరు?

కే: పాడు రంకుపనిచేసి పైగా-

సీ: (ఆలోచనగా) రంకుపనా? అవును. రంకుపనే.

కే: (తనలో) ఎంతమోసం! ఎంతమోసం! ఎంతసమ్మోను! ఇట్లాంటిదానివని తెలీదుకదు! తెలిస్తే దాన్ని-వనాన్ని-సుఖంగా యింటోనే ప్పుకునేవాన్ని. పాపం, యేదో యింతభక్తికలదే, ప్రేమకలదే, దాన్ని యేడిపించడం అన్యాయమని చూసి-యెంతసౌఖ్యాన్ని వృథాగా చేసుకున్నాను. ఎంతఅన్యాయం, ఆరోషమూ ఆదుఃఖమూ, అన్నీ వేషాలే! యిట్లాంటిదానికి రోషమెందుకో! ఏదో నాకు వుపకారమని వొంకపెట్టి, కళ్లు కప్పి, దొంగముండా, యిదాచేసింది! ఏమో యిప్పుడేం-యిట్లాంటిబుద్ధికలది, యేమేం చేసిందో, యిన్నేళ్ళలో! ఇట్లాంటిదాంతోనా, నేను కాపరం చేస్తోంది? యీ రంకుముండతోనా! వుండంటి పవిత్రమైన వంశంలో యిది ప్రవేశించిందా! అవును-అట్లాంటి తల్లికి పుట్టినదానికి యింతకంటే మంచిబుద్ధి ఎట్లాకలుగుతుంది. ఇంత ప్రేమజూపి నీకిన్ని సౌఖ్యాలిచ్చి, నాసౌఖ్యాన్ని, ఆనందాన్ని అంతా తగలేశాను. ఇప్పుడు వాడీవంగతి ప్రారంతా, చాటిస్తాడు, నేనే నిన్ను తనకి వొప్పచెప్పానని!

ఎవరు నమ్ముతారు నామాట నే నేమీ ఎరుగనని...మాట్లా డవేం? ఓసి భ్రష్టురాలా, ఎంతపని చేశావే, నాసంసారాన్ని! నిన్ను వాడు - చెప్పుకుంటాడు-నోటికి వచ్చినవన్నీ చెప్పుకుంటాడు-నేను నోరుమూసుకోవాలి ఈ గోలంతా - యీకష్టమంతా, నాకు నీమూలంగానే - యీ పాడుముండ మూలంగానే...

సీ: నేను పోతాలెండి, మీ కళ్ళకెక్కపోతే.

కే: ఎక్కడికి- యేట్లోకి. పోయి- పోతే ఏంలాభం? పోయేదానివి యిన్నాళ్ళెందుకున్నావు? పోయేదానివి యెప్పుడో పోయి చావక! పీడ విరగడై పోను ..నేనే చేశాననుకుంటారు- తప్పదు_ నా పెళ్ళాన్ని వొప్పచెప్పా ననుకుంటారు. నా ఖర్మంకాలా యింత బతుకుబతికి, యింత మంచి వంశంలో పుట్టి, పరువు ప్రతిష్టలతో బతికి, పెద్ద వుద్యోగంచేస్తో- యీనంగతి తెలిస్తే యింకేమన్నా వుందా? చెప్పావా, వాడితో చెప్పావా నే నాసొమ్ము బాంకిలోంచి తెచ్చానని!... చెప్పావూ...ఇంకేం...నాపని సున్న...అడుక్కు తిందాం——నువ్వెదుక్కుతిను- నాకేం_ నేనేంచేశాను? నాకొంప ముంచావుకద! ఎక్కడదొరికావే, పిశాచీ నాకు...యిప్పుడన్నా అర్థమౌతోందా?

సీ: ఆ, చాలా అర్థమౌతోంది___

కే: ఎంతో నమ్మకమైనదానవని, అటువంటి కోర్కెలేని నిర్మల చరిత్రవని, నాబలవంతం వల్లగాని, యెన్నడూ పశువృత్తి

నభిలషింపని దాసివని, నిన్నింతో గౌరవించాను—ప్రేమిం చాను—కాని యింత కడుపులో పెట్టుకుని మోసం చేశా వనుకో లేదు.

సీ : మిమ్మన్యాయం చేసివుంటే క్షమించండి.

కే : క్షమించి- ఏం చేసుకోను నిన్ను- ఎంగిలిపడ్డ నిన్ను- వూర కుక్క తాకిన నిన్ను-

సీ : (ఆలోచిస్తూ) ఇంకేం చేస్తారు? వెంటమీద పారెయ్యండి. తక్కిన కుక్కలు చీల్చుకు తింటాయి-

కే : గొప్పమాటలు మాట్లాడకు-

సీ : మీకు నిజంగా నన్ను చూస్తేనే బాధగావుంటే, వెడతాను- అదే మీ ఆజ్ఞ ఐతే-

కే : ఎక్కడికి? 'వెళ్ళు' అన్నానో, లేదో, అప్పుడే ప్రయా ణం ఎక్కడికి? వాడి దగ్గరికేనా? కానీ, శుభమస్తు- శీఘ్రం- కాని వాడు నిన్ను పెట్టుకుని యీ ప్రాన్లో- నా కళ్ళముందరే- వీల్లేదు, ఆగు- నిపని అల్లా కాదు. ఫ న్ను- యింట్లో నేపడివుండు. దాసీపని చెయ్యి—(కసిగా) నీముందే- నీకళ్ళముందే, నాయిష్టం వొచ్చిన వాళ్ళని తెచ్చి పెట్టుకుంటా, నీ మొహంముందే- నాకూ, వాళ్ళకీ వొంగు- చాకిరీ చెయ్యి. అంతే. (తలుపు కొడు తున్నారు)

సీ : ఎవరు? (లోపల్నుంచి కీ. సితా. సితా)

కే : వాస్తు. కీలెట!—ఎందుకు?

శ్రీ: సీతా, ఒక్కసారి తియ్యి.

సీ: ఎందుకండీ?

కే: వుండు. నువ్వెవరుకో- ఎందుకో పీడమళ్ళీ వొచ్చింది—
ఇంకా యేం చెయ్యబోతున్నాడో!
(శ్రీతో) పో, వెళ్ళు. తియ్యడానికి వీల్లేదు.

శ్రీ: సీతా, వొక్కసారి—ఆఖరుసారి-

కే: ఎల్లా- అబ్బా! యేంగోల తెచ్చిపెట్టావే! వాడా నడివీధు
లో సీతా సీతా అంటాడు. సిగ్గులేకండా; యేట్లాచావనే నేను!
పో, సీతాకాదు, గీతాకాదు పో.

శ్రీ: తీసిందాకా కదలను.

కే: అబ్బా! యేంచెయ్యను?

సీ: తియ్యండి.

కే: వాణ్ణా...మళ్ళీయింటికా...ఇంకోసారి నన్ను తంతే,
కళ్ళుచల్లగా చూడగలవా?

సీ: ఆయనన్నేమీ అనకపోతే-ఆయనేమీ కొట్టరు.

కే: ఓసి తప్పుడుముండా, నామొదట నేనే, వాన్ని పొగడ్డం!

శ్రీ: సీతా, ఒక్కసారి-

సీ: మీరు తియ్యకపోతే, నేనుతీస్తాను.

కే: కదులు, చెపుతా, సరికేస్తాను-వాడితో లేచిపోవడానికేనా?

సీ: వద్దే, నరకండి.

కే: చావు, ముండా-(కొడుతున్నాడు)

సీ: అబ్బా! అబ్బా!

శ్రీ: నా సీతదేనా ఆ కేక? యింక వూరుకోను.

(తలుపు పగిలేట్టు తంతున్నాడు.)

కే: ఏంఖర్మ మొచ్చింది!

(వెళ్ళి తలుపు కొంచంగా తెరిచాడు. నెట్టుకుని శ్రీనివాసులు లోపలికి వొచ్చాడు)

శ్రీ: అమ్మా! సురక్షితంగా వున్నావుకద!.. నిన్ను-నాసీతని ఒక్కసారి-ఆఖరుసారి చూసి వెడదామని వొచ్చాను. ఇంక శ్రీనివాసులు నిన్ను పీడించడు-నీకు కనపడడు ... (చూసి) అయ్యో! పాపం! కొడుతున్నాడా? ఏం చెయ్యను? వెళ్ళే వాణ్ణి వెడుతున్నాను. వీణ్ణి చంపేసిపోతే ... (కేశవరావు వొణుకుతున్నాడు)...అవును...చంపేస్తే... నువ్వు సుఖంగా జీవిస్తావు. నీ పతివ్రతాదోషం, నీ వెర్రి వొద్దులుతుంది... వుండు...అవును...వీణ్ణి చంపాలి...రా, రా నిన్ను చంపుతాను చంపించుకో (పట్టుకుని గొంతు పిసుకుతున్నాడు.)

(సీతకి అర్థంకావటంలేదు. కేశవరావు కళ్ళుతేలేసి దణ్ణంపెడుతున్నాడు. సీతకి అపాయం అర్థంకాదు.)

సీ: పాపం! నెప్పి పెడుతున్నట్టుంది. వొదలండి.

శ్రీ: యింకేం, చస్తావుంటే. (సీత కి తెలిసింది)

సీ: ఆ, ఆ,- ఎందుకు- అయ్యో- వొదులు- వొదులు-



ఐదో

శ్రీ : నిజంగా వీడుబతకాలా ?

స్త్రీ : ఆయన లేకపోతే నేనుంటానా ?

శ్రీ : పోనీలే. అంతా అంతంకానీ...నువ్వు, వీడు, నేను, లోకం_ అంతా అంతంకానీ యీనాటితో.

సీ : మీపాదాలు పట్టుకుంటా- వొదలండి_ మిమ్మల్ని ద్రోహం చేశాను, కాని నాకువతిబిక్ష పెట్టండి-(శ్రీనివాసరావు కేశవరావుని సీత కాళ్ళమీదపడేశాడు.)

శ్రీ : వేడుకో, ప్రాణదానం చెయ్యమని వేడుకో పట్టుకో కాళ్ళు (కేశవరావు అననబోతున్నాడు ) నోరెత్తావా, ఒళ్ళు_గుద్దుతా తో చాచ్చావే. కాళ్ళుపట్టుకో.

సీ : తప్పు. తప్పు. (కేశవరావు ఆమెపాదాలు పట్టుకున్నాడు.)

శ్రీ : దేవీ, ప్రాణదానం చెయ్యిఅను-అను-

కే : దేవీ, ప్రాణదానంచెయ్యి-

శ్రీ : సీతా, శలవు. తెలిసిందినాకు ఆపదిహేనువందలూ వీడు మెక్కొచ్చినవి. వాడి మాన ప్రాణదానాలు చేశావు. పాలించుకో.

సుఖించు వెయ్యేళ్ళు- గంపెడు బిడ్డల్ని కని సుఖించు- కాని యితరులకి కూడా హృదయాలూ, ఆత్మలూ వున్నాయి, నీకూ నీ భర్తకి మాత్రమే కాదు-

(వెళ్ళాడు.)

కే: పదిహేను వందలూ ఏమిటి ?

సీ: ఆయన యెక్కడికి వెడతారు ? ఏమౌతారు ?

కే: ఏమే, ఆ సొమ్ము ఏదీ ?

సీ: బీరువాలో వుంది. కాని ఆయన ఏమౌతారు ? ఎందుకు ? ఏంచెయ్యను ?

కే: ఎక్కడిది ఆ పదిహేనువందలూ, వాడి దగ్గిర్నించి లాగావా ?

సీ: అవును.

కే: ఎట్లా ?

సీ: త్యాగంవల్ల-

కే: అంటే- సరిగా యేదు.

సీ: ఆయన దెబ్బియిచ్చారు. పాపం! యేమౌతా రిప్పుడు ?

కే: (సంతోషంతో) అమ్మా! నిజమే! నాఆపద తప్పింది. ఈ బాంకిసొమ్ము సంగతి తెలిసి, నావని పోతుందని యెంతో భయపడ్డాను. ఓ! యీసొమ్ము తెప్పించడానికా వాణ్ణి నీవొలలో వేసుకుంది!

సీ: పాపం ఆయన్ని యెంతో అన్యాయంచేశాను- ఎంతో అన్యాయం చేశాను-

కే: మరి అట్లా చెప్పవేం? చాలా తెలివైనదానివే! ఏమో అనుకున్నానుగాని కాని యీ డబ్బుకోసం నువ్వు వాడితో

మరీ చనువు చెయ్యలేదుకద? వాడికేమీ యివ్వలేదుగా!

(తలుపు తోసుకు వసుమారి వొచ్చింది)

వ: ఏడీ, ఏడీ, అతనేడీ?

కే: ఎవరు?

వ: అతనే, శ్రీనివాసులు.

కే: వాడెందుకు నీకు?

వ: ఎందుకు...ఎందుకు...ఏడీ?

కే: ఏమో! ఎక్కడ చచ్చాడో. ఐనా యీ ఆదుర్దా యెందుకిప్పుడు?

వ: రానేలేదా యిక్కడికి? చెప్పండి-నన్నేడిపించకండి.

సీ: వొచ్చారు.

వ: వొచ్చి—

సీ: వెళ్ళిపోయినారు.

వ: మీరేనా, సీతారత్నం! మీరే! అతన్ని పొట్టనపెట్టుకున్న పతివ్రతలు మీరేనా? యేమైనాడు?

కే: ఏమిటి వసం! అల్లా మాట్లాడతావు? మాకేం తెలుసు ఆ వెధవ సంగతి.

వ: అవును. అటువంటి దుర్మార్గుల సంగతి మీవంటివారికి అసలు తెలుస్తుందా? కాని యెక్కడికి వెడుతున్నాడో చెప్పనేలేదా? ఏం కాబోతున్నాడో!

కే: లేదు.

వ: మళ్ళీ వచ్చి ఏమన్నాడు?

కే: ఏమన్నాడు... రౌడీ. నోటికి వొచ్చినట్టు కూశాడు. పోయినాడు. వాడి నోటికి అడ్డ మేమిటి? కాని నువ్విట్టా- యింత దూరం- బహిరంగంగా నడిచివొచ్చావా ఆ అపాత్రుడి కోసం...

వ: (సీతారత్నంతో) మీరన్నా చెప్పండి. ఈకడపటి వుపకారం చెయ్యండి. మీకు మొక్కుతాను.

సీ: ఏమేమో అన్నారు. 'నన్ను చంపేశావు, నన్ను చంపేశావు' అని వెళ్ళిపోయినారు.

వ: అయ్యో శ్రీ! ఎంతగతి పట్టింది నీకు! ఎక్కడికి వెళ్ళాడు? ఏమీ చెప్పలేదా? ఏమౌతానన్నాడు, నాశ్రీ? అయ్యో శ్రీ!

సీ: ఏమీ చెప్పలేదు.

వ: చెప్పనే లేదా! ఏం చెయ్యను? ఎక్కడికి వెళ్ళను? ఎక్కడ వెతకను?

కే: నా యిల్లు ఎట్లాతెలిసిందే నీకు?

వ: మొదటినించీ యింతే! చెప్పాను, నమ్మకు, శ్రీ, యీ కుల స్త్రీలను, నమ్మకు. వీళ్లె సంతవరకు ఆకర్షిస్తారు, సమయం వొచ్చేప్పటికి అంతా మొగాడిమీద తోసి, యేమీ యెరగనట్టు తప్పుకుంటారంటే నమ్మాడుకాదు. నీ కళ్ళల్లో ముగ్ధత్వం నీమాటల్లో మాధుర్యం చూసి మోసపోయినాడు, నాశ్రీ.

కే: ఏమిటిది? నాకర్థం కావటం లేదు.

వ: ఇక్కణ్ణించి వొచ్చాడు, పాపం, హృదయంలో గాయమైన పులివలె- పాపం! నరానరివొచ్చి నా వొళ్ళోపడుకుని అతలని___ (ఏడుస్తా) అంతే- ఆఖరుసారి___ నాకానించి, శూన్యదృష్టిని నాముఖానికి తిప్పి- యిట్లా వొణ్కుతున్నాను గట్టిగా- తెలుస్తోందినాకు-చచ్చేదెబ్బతిన్నాడని-'వనం, చచ్చాను- చంపింది - చంపేసింది' అన్నాడు. 'నేను ముందేచెప్పలేదా' అన్నాను- కఠినాత్మురాల్ని- మెత్తి పొడిచాను. 'అవును చంపింది' అని లేస్తున్నాడు 'ఎక్కడికి' (శ్రీ? వెళ్ళకు. వెళ్ళావా, బతకవు.' అన్నాను. 'యిదివరకే చచ్చాను, ఆ పాదాలదగ్గిర- ఆను చేతుల్లోనే. యూడవని- నాపని అయింది' అసి లేదివొచ్చాడు. పాపం- యీనాలుగు రోజులూ, యెంత ఆనందంలో మైమరిచి- 'నాకు స్వర్గం దొరికింది. నాజన్మ సఫలమయింది. నాఅదృష్టం!' అంటో యెంతో తలుచుకుని, తలుచుకుని ఆనందపడిపోయినాడు. ఏముందో నీలో-ఏం మాధుర్యమో, ఏంహాలాహలమో_చెట్టంత వాణ్ణి నరికేశావు... తెలీదు యెక్కడవున్నదీ- సరే, పోతాను.

కే: యేంచేస్తావు, వెళ్ళి?

వ: వెతుకుతాను.

కే: వాడితో నేమిటి, పోనిద్దూ- చావనీ.

వ: నాకెందుకు కోపం తెప్పిస్తారు. మాట్లాడకండి. ఎక్కడికి పోను? ఏం చెయ్యను? శ్రీ—(వెళ్ళబోతోంది.)
కే: ఏకల్లుదుకాణంలోనో వుంటాడు. నువ్వెళ్లా వెడతావు అక్కడికి?
వ: బతికివుంటె మాత్రం- అవును తాగుతోవుండాలి. కాని. నేను పిలిస్తే వొస్తాడా, రాడు.
(చప్పున సీతారత్నంవేపు తిరిగి)
నా శ్రీని చంపావు! పోనీ నిన్ను దూషించను. నీ కాళ్ళమీద పడతా (పడుతోంది.)
నా శ్రీని నా కియ్యి.
సీ: నే నేం చెయ్యను?
వ: దేవీ, నీముందు, నీ పాదాల ముందుపడి వేడుతున్నాను. వరమియ్యి
సీ: ఏం వరము?
వ: యిస్తాననుు.
కే: వనం, యేమిటీ పిచ్చి నీకు?
సీ: (ఆలోచిస్తూ) నేను స్వతంత్రురాలనా?
వ: (కేశవరావుతో) ఏమైనా కృతజ్ఞత వుంటే, నా మీద ప్రేమవుంటే, కటాక్షించండి.
కే: దాసికే. ? నీ ప్రార్థన నిరాకరించగలనా? పో, తీసుకుపో వాణ్ణి. కాని నీయింటో వుణ్ణెను. పొమ్మను.

వ: అదికాదు. అడగనా?

కే: యింకేమిటి?

వ: యీమెని నాతో పంపండి.

కే: ఎక్కడికి?

వ: నాతో శీనుని వెతకడానికి

కే: ఎందుకు?

వ: ఈమె పిలిస్తేనేగాని రాడు

కే: నీకు మతిపోయిందా? ఇది పిలవడమేమిటి, వాడు రావడమే మిటి? సంబంధమేమిటి? మతిపోయిందా?

వ: పోయింది. నా అవివేకం. పంపండి. అయ్యో! ఆలస్యమౌ తోంది.

కే: మంచిదానివే! నీతో కల్లుదుకాణాలు తిరగమంటావా? ఎవరో తెలుసునా యిది? నా భార్య...ఇంకేంకావాలి. నా పేరు నాలుగుదమ్మిడీలకి కొరఅవుతుందా? పో, యింటికిపో, యీ ఆవేశం అణంచుకో. తరువాత నేను వొస్తాను.

వ: ఏమమ్మా- రావుటమ్మా?

సీ: నేనా?

వ: అయ్యో! రావు- నువ్వెందుకు వొస్తావు!

సీ: ఆయన్ని బాధించాలని నావుద్దేశ్యంకాదు. ఆయన నాపైన అంతమనసు పడతారనుకోలేదు.

వ: మరి ఆకర్షించింది ఎందుకూ? మనసుపడాలనేగా?

సీ : కాని అంత వెర్రిపడతాడనుకోలేదు.

వ : ఎవరి తప్పు ?

సీ : నాదిలాగే వుంది నా అజ్ఞానం.

వ : లేకపోతే యీ కూట్లో బతికే నీకు ఏం తెలును ?

సీ : అవును కూట్లోనే బతికాను.

వ : పోనీ, చివరికి యెందుకు...

సీ : నన్ను- నా దేహాన్ని- కోరాడాయన...

వ : కాని నిర్మలమైన పతివ్రతవు గనక నిరాకరించావు అవునా?

సీ : ఊఁ—

వ : అతని ప్రాణత్యాగ మైనా నరే గాని, నీ పాతివ్రత్యం మాత్రం వొదలవు. అర్థమౌతోందా నీ స్వార్థం ?

సీ : నా దేహమిస్తేనే కాని బతకనంటే నే నేంచెయ్యను ?

వ : యిస్తే నేం ?

సీ : ఛా !

వ : పోనీ, పోనీ, నీ నిర్మలత్వాన్ని నువ్వే దాచుకో. అబద్ధాలాడావు. దొంగమాటలు చెప్పావు. నా శ్రీని వడిపించావు. నన్ను నాథను చేశావు. అంతకన్న- యీ ఘోరాలకన్న, యీ పాపాలకన్న, నీదేహం- నిన్ను పంచప్రాణాలతోటీ ప్రేమించినవాడికి. పోని త్యాగమే ననుకో- నీ భర్తకోసమే, త్యాగం చెయ్యడం పాపమయిందా ? ఎందు కిదంతా- నీ భర్తకి సానిదాన్ని వొప్ప

చెప్పడానికి- నాలుగు రూపాయిలు విలువగల, వీధిలోవుండే, నా దేహాన్ని యిప్పించేందుకు యింత ప్రయత్నమా?
రా, నువ్వుచేసిన పాపపరిహారం చెయ్యి. రా, నా శ్రీనినాకియ్యి. అయ్యో! ఆలిస్యమౌతోంది.

సీ: అన్ని పాపాలు చేశానా? అవన్నీ నా భర్తకోసం త్యాగమేనా?

వ: లాభ మేమిటి? ఎవరికి వుపయోగం?

సీ: అందరికీ- ఆయనకీ, నాకూ, ప్రపంచానికీ...

వ: ఆయనకా? నీత్యాగం వల్ల ఆయన యేమన్నా కృతజ్ఞత కనపరుస్తున్నారా?

సీ: పోనీ నా ఆత్మ సంతుష్టి-

వ: యింకా అబద్ధాలే! నా శ్రీని బలియిచ్చినందుకు నీ ఆత్మ సంతోషిస్తోందా? అంత రాక్షసివా? కావు. ఇంక నాతో వాదించి ఏం లాభం? రాయి కరుగుతుందిగాని కీర్తి భ్రమలో పాతుకున్న పతివ్రతల మనస్సు కరగదు. ఈయనగారికి పాని దాన్ని వొప్పజెప్పి, మెప్పు పొందేందుకు, దోవపొయ్యే అమాయకుణ్ణి పిలిచి, నమ్మించి మోసగించింది. ఏమీ అధర్మం కన పట్టంలేదుట. నిన్నని ఏంలాభం! నాఖర్మం- నా శ్రీ ఖర్మం! (వెడుతోంది. సీత చాలా బాధ పడుతోంది. ఆలోచిస్తోంది.)

సీ: వుండు.

వ : ఎందుకు ?

సీ : నన్ను యీామెతో వెళ్ళనీండి.

కే : దేంకో ? ఎక్కడికి ?

సీ : ఆయన్ని వెతుకుతాను.

కే : నీకు మతిపోయిూది.

సీ : అసలు మతివుంటేకద, పోవడానికి.

కే : ఈ భోగంముండ వెంబడి- లోకం.

సీ : లోకమా ? శ్రీకన్న లోకం యెక్కువా ?

కే : దాని కెక్కువేమో ! నీకెందుకు ?

సీ : పోనీ, ఆమె కోసమే. ఈ హృదయబాధకన్న, ఈ అంతఃక
రణ వేదనకన్న - లోకపరిహాసం చాలా సులభం.

కే : భోగంముండతో___

సీ : నే నారాధించే దైవం, యెవర్ని ఆరాధిస్తాడో, ఆ పవిత్ర
దేవాధి దేవత యీామె !

కే : చాల్లే, నోరుముయ్యి. గైటఅడుగు పెట్టావా మళ్ళీ
రానీను.

సీ : రానీరా ?

కే : సందేహ మెందుకు ? నువ్వు పురుగులుపడి చస్తున్నా
రానీను.